# స మీ క్ష

## గోష్ఠి

తెలుగు మాసపత్రిక

సంపాదకుడు: బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు

సత్యనారాయణపురము, బెజవాడ.

సుబ్బారావుగారు ఇంగ్లీషులో గోష్ఠిపత్రికను నెలకొల్పి రెండు సంవత్సరాలుగా చేస్తున్న సేవ అందరూ ఎరిగిందే. కీ. శే. పుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జీవితాదర్శాలు వారి జీవితకాలంలో ప్రజలు గ్రహించడానికి అవకాశాలు ఏర్పడలేదు. నడి వయస్సులోనే వారు మరణించడం, తగిన వ్యాఖ్యాత లేకపోవడం కారణాలుగా వారి అమూల్యబోధలు అడుగునబడిపోయినవి. ఆంధ్రరత్నాన్ని ఆంధ్రులు మరిచిపోయారు. కాని: ఆయన సందేశాల్లో గర్భించివున్న మహత్వం మాత్రం నిద్రాణంకాలేదు. అర్హుడైన భాష్యకారుడికోసం అవి ఎదురుచూస్తున్నవి. ఈనాటికి త్యాగశీలుడు, విజ్ఞానఖని, ఆంధ్రాభిమాని బ్రహ్మశ్రీ గుమ్మిడిదల సుబ్బారావుగారు ప్రాణాధికమయిన ఆంధ్రదేశానికి ఆంధ్రరత్నం ప్రసాదించిన సందేశాలను చేపట్టి వ్యాఖ్యానిస్తున్నారు. ఇంతకాలం ఆంగ్లంలో ప్రకటన జరిగినా ప్రధానంగా ఆంధ్రదేశంలో వాటికి తగ్గ ప్రచారం జరగడంలేదని గ్రహించి తెలుగులో కూడా గోష్ఠిని ప్రచురిస్తున్నారు. డా॥ మూంజీప్రభృతుల్ని ఆకర్షించిన రామదండు, బ్రాహ్మణధర్మం వంటి ఆదర్శాలు తెలుగుల కింకా ఒంటబట్టలేదు. ఈ ప్రచారంలో సుబ్బారావుగారు చేస్తున్న త్యాగం అఖండమయినది. ఆంధ్రు లిది గమనించాలి. ఆంధ్రరత్నాన్నీ, ఆయన బోధలనీ ఆరాధించాలి. ఆంధ్రరత్నం కలలుగన్న బ్రాహ్మణమతదీక్ష సుబ్బారావుగారు ఆశిస్తున్నట్లు లోకమంతా స్వీకరిస్తే నిజంగా విశ్వసౌభ్రాతృత్వం కరతలామలకం! అపూర్వమైన ఈ సనాతనధర్మవ్యాఖ్యానాన్ని అందరూ చదివితీరాలి.

ఏడాదిచందా: 1-8-0 విడిసంచిక: 0-2-0

క్షత్రధర్మ మింత కష్టమగునె? పెఱ
ధర్మమాచరింపఁ దగదటంచ్రు
గాన శస్త్రజీవికయ తగియున్నది
యైన వంశనాశ మనభిమతము (ఉద్యో 3. 15)

ఇప్పటి మన క్షత్రియబాలురును, తమస్వధర్మమును గుర్తెఱిఁగి యంద లి ధర్మతంత్రములను బాగుగ పఠించి వానిని యిప్పటి యుద్ధప్రక్రియ లతో సమన్వయమొనర్చి, ధర్మరక్షణకు గడంగవలయును. ప్రతిభారత యోధుఁడును, అర్జునునిబోలె, తన సేనాధిపతియందు నారాయ ణుని, యుద్ధక్షేత్రమందు ధర్మక్షేత్రమును, ఆయుధమందు విష్ణుచక్ర మును, వాయువిమానములందు గరుత్మంతుని, వార్తావళియందు సంజ యుని, విజయమందు ధర్మమును, మరణమందు వీరస్వర్గమును గాం చి ముక్తి జెందెదరుగాక.

ఓమ్! శాంతి శ్శాంతి శ్శాంతిః



సమరక్రీడలందు "శత్రువధోత్సవము" న:

తరుణుల కుచములపై రతి
పరవశులై యొఱగు పతుల పగిది సమరసం
భరిత శ్రమమున నిద్రిం
చిరి కరికుంభములఁ జెంది చెచ్చెరఁ జోదుల్

(ద్రోణ— 4. 273)

అటులనే శల్యుఁడు శక్తిచే గూలునపుడు:

భూమిమీద నిట్లు భోరగిలంబడి
మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర!
లేమ యురమునందు లీనమై వ్రాలిన
ప్రాణనాథుఁ బోల్పఁ బట్టుగాఁగ. (శల్య. 1. 286)

సంధివిషయమై:

తమకు బలం బెక్కునతఱి
సముచితమగు విగ్రహంబు శత్రులకుత్సా
హముమీఱినపుడు కర్త
వ్యముసంధియనంగ విందు మార్యులచేతన్. కర్ణ.1.56

ఆపద నొందినపుడు:

గతమునకును వగవక నా
గతమునకును నోరు దెఱచి కడుఁ గోరక దీ
నతఁ బొందక దైవంబే
గతిఁబుచ్చిన దానఁ బోదుఁగాకనవలయున్

(శాంతి 3. 30)

వేయేల? క్షాత్రధర్మముగూర్చి భారతమందలి యొక సూత్రరాజ మునుమాత్ర మిట వివరించి యంతటితో ముగింతుము.

యునికి సకలజనులయెడల నురవై యుండున్.

(శాంతి. 2. 381)

నమ్మఁదగినివారి నమ్మక యున్నది
తగినవారినైనఁ దద్దనమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడు నట్లు
యుండి యొరుల నమ్ముకునికి నీతి (3. ౨౩౯)

వార్తావళిగూర్చి:

వార్తయంద జగము వర్తిల్లుచున్నది
యదియు లేనినాడ యఖిలజనము
నంధకారమగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయుఁ బతికి (సభా 1. 50)

యుద్ధభూమినుండి వార్తలను దెచ్చుటకై వేదవ్యాసుఁడు సంజయున కొసంగిన వరంబు లెవ్వియన:

"ఇట్లు ధృతరాష్ట్రునకుఁ గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యా సూతనందనునకు నారెండు తెఱంగులవారి దివారాత్రప్రవర్తనంబులు గనునట్లును, రహస్యప్రకారభాషణంబులు వినునట్లును, మనోవృత్తంబు లెఱుఁగునట్లునుంగా వరంబులిచ్చి, యతిశీఘ్రగమనంబు నొసంగి, భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబులెవ్వియుం దాకకుండునట్టి ప్రభావంబుప్రసాదించి దివ్యుల యాలాపంబులు, రూపంబులుం, దలంపులుం దేటపడునట్టి మహనీయబోధంబునుఁ గలుగనను గ్రహించె" (భీష్మ. 1. 8).

యుద్ధసన్నాహము:

భూరివిభూతి బెండ్లికిని బోఫు తెఱంగునఁ బాండునందనుల్
దారును బుత్రులున్ హరియుఁ దమ్ముఁడు నుజ్జ్వలచారులీల శృం
గారము సేసి సమ్మదవికాసమెలర్పఁ గవీరసంభ్రమో
దారసముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కందఱుం దగన్

సూక్ష్మ, రథమధ్యమ, మోహన, ఐంద్ర, పాశుపతములను అస్త్రము లును; ధనుస్సు, ముష్టి, అసి, గద, శక్తి, తోమరము లను ఆయుధ ములును; శ్యేనము, మకరము, క్రౌంచము, మండలము, కూర్మము, మోహారము, గరుడము, అర్ధచంద్రము, శృంగాటకము, సర్వతోభద్ర మను వ్యూహములును; పురవిషయము (శాంతి. ౩౮౩) గణజనుల పాలించు ప్రకారము, పరివారము (౩. ౧౦౩), సభల విషయము, అమాత్యవిషయము, (సభా. ౧. ౨౮) మున్నగు విషయము లెన్నో విపులముగ వర్ణింపబడినవి. అందగ్ని దేవుడు నారాయణున కిచ్చిన సు దర్శనచక్రమిట్లు వర్ణింపబడినది.

"సహస్రకరదుస్సహరుహః పటలభాసురంబగుచు దేవదైత్యదానవయ క్షరాక్షసపిశాచోరగప్రశమనంబై వెలుంగు సుదర్శనచక్రంబు... "

ఈ చక్రము మధుసూదన!
నీచేత విముక్తమగుచు నీ రిపులఁ క్రియా
మాచరులఁ జంపి క్రమ్మఱ
నీ చేతికి వచ్చు దేవనిర్మితశక్తిన్. (ఆది. 8. 257)

ఇట్టి విష్ణుచక్రములే ప్రపంచ మెల్లను నేటి రివాల్వర్లుగా పరిణమించ లేదని యెవ్వరనగలరు?

సేనాధ్యక్షునిగూర్చి:

నానావిధరణవిజయ మ
హానిపుణు లవార్యవీర్యు లనఁదగువారిన్
సేనాధ్యక్షులఁ జేసితె
నీ నమ్మినవారి మాననీయుల హితులన్. సభా. 1.30

పరులను నమ్ముటవిషయమై:

తనయుల నైనను నమ్మిన
జనపతి సిరి గోలుపోవుఁ జతురతమై న
మ్మినవాఁడపోలె నమ్మక

గురు కాల్బలములు వీని యధికారి పత్తికుడు. పది పత్తుల కధికారి సేనాపతి. పదుగురు సేనానాయకుల కధ్యక్షుడు బలాధ్యక్షుడు (౧౯౯)యుద్ధరంగమున సైన్యమును వ్యూహములుగా నిల్పి జయమున ధర్మమును, మరణమున స్వర్గమును పలాయనమున బ్రభువుపాపమునొందుటయు, నరకము నొందుటయు, గలుగునని చెప్పి వారిని యుద్ధమునకు బురికొల్పవల యును. (౧౯౮) శత్రురాజులను జయించి దేవతలను బ్రాహ్మణులను పుణ్యాత్ములను బూజించి యా దేశవాసులకు బరిహారముల నొసంగి "యెవరెవరు తమ యజమానునియందు భక్తితో మాతోఁ బోరిరో, వారికి నభయంబొసంగెదము; నిర్భయముగ తమతమ పనులు సాగించుకొనవచ్చు" నని దేశమున చాటింపవలయును. (౨౦౧) ఆ రాజ్యమున నా శత్రురాజు వంశమువానినే యొక్కని నభిషేకింపవలెను (౨౦౨). ఆ దేశపు టాచారములు, ధర్మమునే తానును బ్రమాణముగా గొనవలయును (మనుస్మృతి).

ఇటులనే మహాభారతభాగవతాది యుద్గ్రంథములందును యుద్ధధర్మములును, రాజవిధులును యెన్నియో వివరింపబడినవి. అందు ముఖ్యముగా భారతమందు యుద్ధనీతి యెంతయో వర్ణింపబడినది. శాంతిపర్వమున యుద్ధముగురించి ప్రస్తావించుచు:

"ఏ యజ్ఞంబులును సంగ్రామయజ్ఞంబునకు సదృశంబులు గావు వినుము వీరమస్తకరాశి వేదికగా, కృపాణబాణాదిసాధనంబులు సమిత్స్రుక్సువంబులుగా, శోణితం బాజ్యంబుగా, మాంసంబు పురోడాశంబుగా, వీరవ్రతదీక్షితుండు సమరాధ్వర్యంబుసలిపి, రుధిరపూరయు, మస్తిష్కకర్దమయు, కేశశైవాలయు, నాంత్రఫేనయు, భేరీమండూకయు, హేతిమీనయు, గజకళేబరపులినయు, నగు సమరపుణ్యానది నవభృథస్నానంబు సేసి మదీయలోకంబున సుశ్లోకుండై నిత్యస్థితి నత్యుదాత్త పదవిం బ్రవర్తిల్లు బుణ్యాతముండగుటకుం దనువుదొఱంగవలయు" నని ఇంద్రుడంబరీషన కుద్బోధించెను. (౨. ౮౮౩) భారతమందే ఆగ్నేయ, వారుణ, అనిల, మేఘ, భూమి, శిలా, హ్రస్వ, దీర్ఘ

రాజు తనకు సహాయముగ "వంశపారంపర్యముగ వచ్చుచున్న వారిని శాస్త్రజ్ఞులను, శూరులను, ఆయుధములందు నేర్పరులను, మంచి వంశములందు బుట్టిన వారిని యేడ్గురనో, యెనమండ్రుగురనో పరీక్షించి మంత్రులుగ నియమించుకొనవలయును. (౭. ౫౫)

ఈ మంత్రులతో "దాపరాని సాధారణవిషయములను, సంధివిగ్రహములను, దండము; ద్రవ్యము, పురము, రాష్ట్రము అను నీ నాల్గింటి నిగూర్చియు వ్యవహారములను; ధాన్యములు, బంగారు మున్నగునవి పుట్టు చోటులను రక్షించుట దొరకినధనమును సత్పాత్రములం దుపయోగించుట మున్నగు వానినిగూర్చియు ఆలోచింప వలయును. తన మంత్రులలో నొక్కొక్కని యభిప్రాయమును వేర్వేరుగా నాంతర్యముగను, అందరియొక్క సమిష్టి అభిప్రాయమును బహిరంగముగను తెలిసికొని రాజకీయకార్యములలో దనకు మేలెయ్యదియో అద్దానిని జేయవలయును. (౫౬-౬౦) నగరులోపల కార్యములందు భయశీలురగువారిని నియమింపనలయును. శూరులగువారి నంతఃపురమున నియమించినచో నచ్చట దరచుగ స్త్రీలతో నొంటరిగా మంతనము గావించు రాజును శత్రులకడ లంచముగొని సంహరింపవచ్చునుగాన శూరుల నట నియమింపరాదు. (౬౨) ఐహికాముష్మికశాస్త్రముల నెరిగినవాడును, ఇతరుల మనస్సు నెరుగు నేర్పు, స్వభావము, ఆకారము— వీని సంజ్ఞ లెరిగిన వాడును అగు దూతను నియమించవలెను. జనులయం దనురాగముకలవాడును, స్త్రీలవిషయమునను, ధనవిషయమునను, బరిశుద్ధుడును, నేర్పరియు, జ్ఞప్తికలవాడును, దేశకాలముల నెఱింగినవాడును, రూపరియు, భయములేనివాడును, మాటలయందు నేర్పరియునగు దూతను రాజు తన సమక్షమున నుంచుకొనుట మంచిది, (౬౪). శత్రుపురమును దండవ్యూహము, శకటవ్యూహము, వరాహవ్యూహము, గరుడవ్యూహము, మకరవ్యూహము, సూచీవ్యూహము లను ఆరు వ్యూహములలో నొక్కదానిచే ముట్టడించవలెను (౧౮౭). పదిరథములు, పదియేనుగులు, పదిగుఱ్ఱములు, పదు

మన్యరంధ్రంబుల నారసి కనుము ... ...

(ఆశ్రమ. ౧ ఆ. ౬౭ పద్యము)

"విజయమునకై ప్రయత్నించు నృపాలుడు తనకు విరోధులగు నర పాలురను సామాద్యుపాయములచే దనకు వశంవదులుగ జేసికొనవలయును. ఇట్లు వారు మొదటి మూడుపాయములచే మరలరేని, అప్పుడు బలముచే యుద్ధముచేసియే బలాత్కారమున వారిని మెల్లగా వశపరచుకొనవలయును. సామము మున్నగు నాలుగుపాయములలో సామమున ప్రయాసము, ద్రవ్యవ్యయము, సైన్యనాశనము మొదలగు దోషములు లేనందునను, దండమున నవి యున్నను కార్యసిద్ధి యున్నందునను సామదండముల రెంటినిమాత్రమే విద్వాంసులు రాజ్యాభివృద్ధికొరకు ప్రశంసింతురు. (౧౦౭-౧౦౯) తనకు ప్రక్క నున్న నృపాలురందరను సామదానభేద దండోపాయములను ప్రయోగించి వారితో వేరువేరుగ గాని, కలసి ప్రవర్తించిగాని యందరను వశపరచుకొనవలయును. లేదా, కేవలము దండముతోనేకాని, కేవలసామముతోగాని వారిని వశపరచుకొనవలయును. అటుపిమ్మట నుభయుల ప్రయోజనముల దలచి రాజులతో సంధిని గాని, యుద్ధమునుగాని, యుద్ధయాత్ర, ముట్టడి, వేరుపరచుట, శత్రుబాధల కోర్వక శత్రువు కంటె మించిన రాజు నాశ్రయించుట, ఈ యాఱు ఉత్తమగుణములను బరికింపవలయును. ఏ గుణము నాశ్రయించిన దనకు మేలును శత్రువునకు కీడును గలుగునో, అట్టి గుణము నవలంబింప వలయును. ఇట్లు తన యభివృద్ధిని, శత్రువుల క్షీణదశను ఈ మొదలగువాని నాలోచించి ముట్టడిని, యుద్ధయాత్రను, సంధిని, యుద్ధమును ద్వైధమును, సంశ్రయమును, కార్యమును బరికించి యే వేళకు నేగుణ ముత్తమమగునో దాని బ్రయోగింపవలయును. (౧౫౯-౧౬౧) ఒండొరులతో బోరాడుచున్న రాజులకు జయాపజయములు నిత్యములుగావు కావున నెప్పుడును యుద్ధముచేతనే శత్రువును లో బరచుకొన జూడరాదు. (౧౯౯)

వానిని, ఆయుధములు లేనివానిని, తనతో యుద్ధము చేయనివానిని, యుద్ధప్రయత్నము లేనివానిని, యుద్ధమును చూచుచుండు వానిని, ఒరునితో యుద్ధము చేయువానిని, ఆయుధములు విరిగిపోయిన వానిని, నొచ్చిన వానిని, దెబ్బలు తిన్న వానిని, భయపడిన వానిని, వెనుకకు మరలిన వానిని శిష్టులగుక్షత్రియులు ధర్మము దలచికొని చంపరాదు. (౭. ౯౯ - ౯౩) దీనినిబట్టి మా గోపాలకృష్ణు డనినట్లు యుద్ధములుగూడ హింసారహితముగా నుండగలవని గ్రహించునది.

"Even wars can afford to become non-violent."

రణమునందు గెల్చినవా డోడినవానికిగల రథములు, గజములు, గుర్రములు, గొడుగులు, ధనము, ధాన్యము, పశువులు, స్త్రీలు, సకల ద్రవ్యములు, వెండి, బంగారు వీని నెల్లను గైకొనును. రాజునకు నుద్ధారము నొసంగవలెనని శ్రుతి చెప్పుచున్నది. రాజు తానుయుద్ధమునందు సమిష్టిగాజయించిన వస్తువులను యుద్ధవీరుల బలశక్తులకు దగినట్లు బహుమతులుగా బంచిపెట్ట వలయును. యుద్ధవీరుల కిది సనాతనధర్మము. క్షత్రియుడు శత్రువులను జంపుచు తాసి ధర్మమునుండి తొలగరాదు. రాజు తనకు దొరకని దానిని సంపాదింపగోరవలెను. దొరికినదానిని పూనికతో సంరక్షింపవలయును. రక్షింపబడినదానిని వృద్ధిచేయువలెను. అట్లు వృద్ధియైనదానిని యోగ్యులం దుంపవలెను. (౯౭-౯౯) ఎల్లప్పుడును రాజు దండధారియై, చతురంగ బలమును సిద్ధపరచుకొని, తన పరాక్రమమును వెలిబుచ్చు చుండవలెను. ఎల్లప్పుడును తన రహస్యములను కప్పిపుచ్చుకొని, శత్రువుల రంధ్రముల ను వెదకువాడై యుండవలయును. (౧౦౨)

నిత్య ముద్యతదండస్స్యా న్నిత్యం వివృతపౌరుషః
నిత్యం సంవృత సంవార్యో నిత్యం ఛిద్రానుసా ర్యరేః॥

దీనినిగూర్చి భారతమం దిట్లు చెప్పబడినది:

ఆత్మరంధ్రము లించుకైనను నొరులకు
నెఱుఁగ రాకుండఁగ మఱుఁగు సేయు

# మన రక్షణ సమస్య —    : :
# : :  క్షాత్ర ధర్మములు

బ్ర॥ శ్రీ గుమ్మిడీదల వెంకట సుబ్బారావు

యుద్ధమున నెవరికి వారు ఎవరినైనను ఇచ్ఛవచ్చినరీతి మారణముచేయుటకాదు. అట్టి మారణమునే హింస యందురు. యుద్ధమునకు, హింసకు చాల భేదమున్నది. హింస (Voilence) నియమబద్ధము గాదు. యుద్ధవీరుడు తన శౌర్యపద్ధతి నిసుమంతయు దప్పరాదు. ఇట్టి నియమబద్ధమగు హింస అహింసయే యగునని స్మృతులు పల్కుచున్నవి:

యా వేదవిహితా హింసా । నియతాస్మిం శ్చరాచరే ।
అహింసా మేవ తాం విద్యా । ద్వేదాద్ధర్మోహి నిర్బభౌ ॥
( మను. 5. 44. )

అనగా నే హింస వేదవిహితమైనదో దాని నహింసయని యెఱుంగవలయును. ఏలయన వేదములనుండియే కదా ధర్మము చక్కగా వెలయుచున్నది.

ఈ యుద్ధనియమములు మనుస్మృతి, భారతాదిగ్రంథములందు విస్తరించి వర్ణింపబడినవి. మనుస్మృతి యేడవ అధ్యాయమందలి శ్లోకరాజముల సారాంశము నిందు పొందుపరచుచున్నాను:

“ రాజులు యుద్ధములం దొండొరుల జంపగోరువారై తమ శక్తికొలది యుద్ధముచేయుచు యుద్ధమునుండి మరలక అచట మృతి నొందిరేని స్వర్గము నొందుదురు. యుద్ధమున, పైకి కట్టవలె నుండి లోపల వాడిమిగల శస్త్రములతో శత్రువును గొట్టరాదు. విషపుపూత పూసిన ఆయుధములతో శత్రువును గొట్టరాదు. నిప్పుతో కాచిన బాణములతోను జంపరాదు. తాను రథమున నుండగా రథము విడచి నేల నిలచిన శత్రువును జంపరాదు. నపుంసకుని, శరణుజొచ్చినవానిని, తల విరియబోసికొన్నవానిని, కూరుచుండినవానిని, నిద్రించు

కృత్రిమతన్మయత్వం ... దర్పణంలో ప్రతిఫలించిన ... యజమాని దీనమూర్తిని ... కనబడనీయలేదు. ఐనా ... లక్ష్యంచేసే ... స్థితిలో ఉన్నారా ... ...

— అలా ... అలా ... జారుతూ ... పట్టుదప్పి ... నిరీహతో కూలిపోయినాడు— ... ఎండమావులను ... దివ్యోదపూరములని ... అత్యాశతో ... డాయబోయి ... పోయి ... చివరకు ... హతాశుడైన ... పాంథునిలాగు ... ... ... ...





శుక్రవారం ... ...

పున్నమి వెన్నెల ... కళలు చిమ్ముతూన్నది: ఆతడు ... అసహజమైన అప్రమత్తతతో, హుషార్‌తో ... అంగలో మెట్లన్నీ లంఘించి ... లోపలకు వచ్చి... స్టాండుమీద ఉత్తరీయాన్ని ఉచ్చి వదలి ... డ్రాయింగ్ రూమ్ తలుపును అరవిరియించడానికి ...తళతళలాడుతూన్న గుబ్బను త్రిప్పి ... నెట్టబోతూ ...

మాటలు వింతగా వినబడగా ... ఆలకిస్తూ ... అనుకోకుండానే ఆగి... చప్పుడు కానీయకుండా, బెట్టును నెమ్మదిగా వదలి ... అడుగులు తడబడి, సడి చేయకుండా, గోడకు భుజం ఆనించి ... ఉండిపోయినాడు:

" ఏమండీ ... మీా ... నేర్పు ... నాకు ... చేతనవుతుందా ... ఏమో ...అంత భాగ్యమా... రసైకజీవులు ... ధన్యులు ... మిమ్ములను ... ఎడబాయకుండా ... చెంత ఉండడానికి ... నోచుకున్నవారు ... నావంటిదానికి ... మనం ... ఇద్దరం ... "

——— విన్నంతవరకూ ... చాలదూ? ... ఆశాసౌధములన్నీ ... గిరగిర తిరిగి ... నేలలో కలిసిపోయినవి. —— ఇంకా ... సందేహమూ? ... అయినా ...

చీమ చిటుకుమన్నంతయినా ధ్వని కానీయకుండా ... తలుపు తీసి, చూడలేక ... చూడలేక చూసి ... అర్థంకాక ... తన కళ్ళను ఓ మట్టున నమ్మలేక ...పోయినాడు:

ఎదురుగా ...సోఫాలో ... ఒకరిమీద ... ఒకరు తూలి ... ఆమె ... చిత్రకారుడు:

వెనుకవైపుగా ఉండటంచేత... ఆతని రాక వారికి...పొడకట్టలేదు.

రా ... చెప్పండి ... "

" ఇతరులు ... మెచ్చుకోవాలని కాదు ... నేను రచయి తను ... అయినది.... "

" ఈ దంభవామనమునకేం? ... తగినంతగా ... పేరు ప్రఖ్యాతులు రాలేదని ... మీరు అనుభవించే ... వ్యథాఖిన్నత... మీ చూపుల్లో ... నాకు కన్పడదనుకున్నారా... అప్పుడప్పుడు..."

" ... పొరపాటు ... నా సాహితీశ్రమ అంతా ... కేవలం ... ఆత్మానందం కోసం... "

" అందుకు ... అయితే ... ఇది ఒకటేనా మార్గం ..."

" ఎవరి ... రససిద్ధి వారిది ... "

" ఊహుఁ ... అందుకనే కావ్యాలు ... ... కథలలోను ఖండకావ్యాలలోను ... నిరాటంకంగా ... చక్కని చుక్కలతోను ... సొగసు కోర్కెలతోను ... సయ్యాటలాడుతూన్న మీరు ... నాలోని రసికత్వానికి నికషంగా ఉండలేక ... జీవన మాధురీ రుచులను ... దూరం చేసుకుని ... "

ఆతను ... నొచ్చుకున్నాడు. ఆమె ... అది, గమనించికూడా:

" అందుకనే ... మన ఉభయుల పంథాలూ ... భిన్నములవుతూన్నవని ... సందేహం కలుగుతూ ఉన్నది: ముందు ... ముందు ... ఇంకా ...మరీ, మరీ దూరం అయిపోతామేమో!...

ఆతనికి ... ఏమీ తోచినదికాదు. లేని ... చిరునవ్వును ... తెచ్చిపెట్టుకుని ... ఏదో ... అనబోతుండగా:

బాంయ్ ... బాంయ్ ... బాంయ్ ...

హారన్ ...వినబడ్డది. కారులో వచ్చిన మిత్రుణ్ణి ... ఎదురుగా వెళ్ళి గౌరవించే... నెపంమీద ...

ఆ నాటకం మానేసి ... బయటకు వచ్చేశాడు ......

* * * *

అబ్బ... ఉండండి... నొక్కుకుంటోంది... లోలకు... "

" ఉహుఁ ... చెప్పదలచుకున్నది ... చెప్పిగాని ..."

" చెప్పండి... మరి ... "

" నీ ... పుట్టినరోజుకు ... ప్రెజంటు... "

" మీ ... యిష్టం ... "

" శర్మచేత ... నీ బొమ్మ పెద్దదిగా గీయించి ... "

" అవును,... అలా చెప్పడం... ఎన్నో మారో ... "

" ఈమారు ... తప్పదు. అతనికి కబురంపుతాను ... సామగ్రితోసహా రమ్మని: ... ఇంకా పదిహేను రోజు లున్నది: — చక్కగా, శుక్రవారం నాటికి తయారు అవుతుంది...."

" ... చూస్తానుగా ... "

మరి...మరి ... నాకేమి... ఇస్తావు... "

" ఎందుకూ ... రెట్టించడం? నేను ఇస్తాననేవి ... ఏమీ మీకు పనికిరావుగా ... "

" అలా ... జరిగేది ... అప్పుడప్పుడేగా ... "

" మీరు ... వ్రాతలో ... భవిష్యద్భావస్వప్నానందపిపాసలో ... మగ్నులై ఉన్నప్పుడు ... "

" అది ... నిజం. అలాటి అమృత ముహూర్తాలలో ... ... చతుర్ముఖుడు వచ్చి...చెంత నిలబడినా ... చలించను... "

" ఉహుఁ అదీ గొప్పే. అవునవును ... ఎవరి పిచ్చి ...ఎందుకో ... ఆ వ్రాతలన్నీ. పట్టుమని పది అయినా ... ప్రపంచం ముఖాన్ని చూడలేదు...."

" అలాటి ... కీర్తికాంక్ష నాకు ఉంటేగా... "

" పోనీ, వాటిని... ఆదరించినవాళ్ళు ... ఎవరైనా ఉన్నా

లను పొంది ... పూచి, పరిమళించేటట్టుగా దోహదంచేసి, —
... ఆత్మసాక్షాత్కారంకోసం ... ఏకావరణ జన్యములే అయిన
... సౌందర్య రసానందములతో అక్షినిమీలన కేళి సాగిస్తూ ...
ఆనందగీతమును పాడుతూ ... ఆనందసూత్రమును అల్లుతూ ...
... ఆనందమూర్తిని చిత్రిస్తూ: ... తానొక అక్షరరమ్య శిల్పిగా
... భావుకుడుగా ...

అదే ఆతని ఆశయము. ఏది ఎటులైనను ... ఎటు పోయిననూ .. సరియే. తన కోర్కెలు .... తన పద్ధతులు .... సమకాలీనుల సమాదరణకు పాత్రము కాకపోయినప్పటికీ .... ఆతనికి ..... అలమటలేదు. ...,

కాని, ... ఏమో? ... మానవత్వము అంతపూర్తిగా మరుగుపడి పోతుందా? ...

* * * *

టీ — సిప్ చేస్తున్నారు. ... . ఎదురెదురుగా కూర్చుని:
ఆతడే ... ముందు పలుకరించాడు:

" మరి ... ? "

" ఊఁ ... "

" పై శుక్రవారమే ... కాదూ "

" ఏమిటది? ... "

" నీ పుట్టిన దినం "

" ఏమో ... ఎప్పుడు అయితే ఏం? ... "

" అబ్బ ... ఎప్పుడూ ... అలుకేనా? ... "

" తమరు చేసేవి...అలా ఉన్నవి... "

చెంగున గంతువేసి ... లేచి, ... ఆమెను చేతులలోకి తీసుకున్నాడు....

ఆమె ... ఆగలేకపోయింది. దభాలున...అతని ముఖాన్ని వక్షోప బృంహణాక్రమంతో ...

"ఏమండీ, పైకి పోదాం. రారూ? పొద్దు పోయింది ...

అతడు . . . తప్పించుకోడానికి ప్రయత్నించాడు... ప్రత్యుత్తర మీయకుండానే.

ఆమె... పెనవేసుకోబోయింది: కాని ... అతడే గెలిచాడు. పట్టు విడిపించుకుని... తిరిగీ వ్రాతలోకి దిగాడు . . . . . .

ఆమెకు... ఆగ్రహం వచ్చింది: కాని... అనునయాలాపాలతో... కార్యం నెగ్గించుకోవాలని:

"నిద్దర ... వస్తోందడీ: రారూ..."

— రానసే సూచనగా... అతను తల త్రిప్పాడు.

"అయితే ... స్విచ్ నొక్కి ... లైట్ ఆర్పివేస్తాను ..."

"...మారాంచేయక ...వెళ్ళి పడుకో..."

"ఒంటరిగానేనా? ..."

"ఊఁ ... ... "

ఆమె ... ఆపాదమస్తకము శీతలించి ... తన ఎత్తు నెగ్గలేదుగదా అని నిస్పృహచెంది ... ప్రయోజనం లేదని నిర్ధారణ చేసుకుని... ఆతన్ని వదలి వెళ్ళలేక ... వెళ్ళలేక ... వెళ్ళి ... పో ... యిం ... ది.

——— చలించకుండా ... వ్రాస్తూనే ఉన్నాడు: కవి ... కథకుడు ... విమర్శకుడు — అయిన ఆతని ఆదర్శములు ... ఆలోచనలు ... పోకడలు ... ఇతరులకు అంతగా ... సులభ గ్రాహ్యములు కావు:

... బాహ్యాంతర ప్రవృత్తులలో ... నిబిడీకృతమై ఉన్న ... విశిష్ట సౌందర్యాన్ని అభివర్ణించి ... తెనుగుతీగలు తీరు తియ్యాము

ఆతడు, ... ఆఘూతమనస్కుడైన ఆతడు ... స్థాయి చిక్కించుకునే టంనుకు ... మరొక సిగరెట్ కన్యను చేరదీసి... భావసమాధి

* * * *

రాత్రి:

“ చూశారా ... ఎంత బాగున్నదో ... వెదర్ ... ”

ఒయ్యారంగా ... తూగుటుయ్యాలలో కూర్చుని ... తమలపాకుల చిలకలు తయారుచేస్తోంది. — కిటికీలోనుంచి ... ఆకాశం మీద పేరుకుంటూన్న...మబ్బు దొంతరలను ... చూస్తూ:

“ చూశారండీ ... మేఘైర్మేదుర మంబరం? ... మీరే కనుక ... నెమలి అయితే ... పింఛంవిప్పి నృత్యం చెయ్యకపోయా రా ... ఏం ... కాదూ? ...

ఆతడికి వినపడలేదు: వినిపించుకునే ధోరణిలో లేడు ...

తల వంచుకుని ...అదే పనిగా అక్షరముల సహాయంతో ... భావమణిమాలలను పోహణిస్తున్నాడు: — సాహితీ సౌధ చంద్రశాలను ... కవితావల్లకిని ... ఐంద్రజాలికాంగుళీయములతో ... స్పృశించి ... కవితాయోగమున ... సాయుజ్యము నందుతూన్న ... ఆ రసతృష్ణాళువును ... మేనక యంతటి వన్నెలాడికూడా ... ఆ సమయంలో ... భంగపాటొనర్చలేక ... మరలిపోయేది ...

మెఱపులు ... వెనువెంటనే ... ఉరుములు ... పిడుగులు...— ఫెళఫెళా ... తపతపా ... ఆకాశం చిల్లిపడినట్టుగా ... ఎడతెరిపీ లేకుండా ... చినుకులు ... హోరున పెనుగాలి ...

ఆ ... జవరాలు, పూర్తిగా రెచ్చిపోయి...ఇక ఎదలోపలి తలపాపలేక ... లేచివెళ్లి ... కిటికీ తలుపులు బంధించి...ఆతడు కూర్చున్న కుర్చీ చేతిపైన వ్రాలి ...

ఆతడు ... చూడడు:

"ఏమిటి..." అనే అర్థం ... స్ఫురింపజేశాడు:
వళావళితో, ... తూలుతూ ... తొట్రుతూ ... ఆమె అతని పరాకును మన్నించకుండానే ... దగ్గరకు వచ్చి ...... చేతులో ఉన్న "మాగజీన్" ను ... పుటలు త్రిప్పుతూ...

"చూశారా... అన్యాయం..." — అని రెట్టించింది:
తప్పనిసరిగా ... అతడు, మొహం ఆమెవైపుకు త్రిప్పి:

"ఏం ..." కిరణావళి" ... వచ్చిందా? ... " అన్నాడు.

"ఆఁ ... వచ్చింది, ఏలాగైతేనేం. ఎందుకూ? ... మీ గీతాలుగాని, ... కథగాని అచ్చుపడలేదు ... "

కలిగిన ఆశ్చర్యాన్ని ... అంతగా పైకి కనబడనీకుండా ... "మాగజీన్" ను అందుకుని, ... అటు యిటు త్రిప్పి చూచి ... ఆమె అన్నది యథార్థమేనని రూఢిచేసుకుని ... కొంచెం దిగులుతో మూగవోవగా ......

"ఏం ... లాభం. మళ్ళీ ... పైకి అందరూ స్నేహితులే బ్రతిమాలి ... మరీ బ్రతిమాలి కాదూ ... మీ రచనలను తీసుకువెళ్ళారని ... చెప్పారు మీరు? ... మొదటి సంచికకదా ... మీ కృతులకు గౌరవస్థాన మిచ్చి ప్రకటించ కూడదూ ... అంత మాత్రం ... "

" ... ఈమాత్రానికే ... " — చిన్నబుచ్చుకున్నాడు...

"నేను ... అనడంలేదూ మీతో, ... అడపాదడపా ... మీ సాహితీసమీహాలు ... పట్టి ... ఎండమావులని ... "

అతడు ... తోణకలేదు . . .

పరస్పరసంవీక్షణదీక్షలో ... అయిదు నిమిషములు: — ఆ క్రొత్త మాసపత్రికను ... ఆమె గది మూలకు విసిరివేసి ... ఇక అక్కడ ఒక క్షణమైనా ... నిలువలేదు:

అప్పటికి, పూర్తిగా సుప్తోత్థితుడై, ... ఆమెను నయగారపు మాటలతో ఊరడిస్తూ, ... మెలమెల్లగా ... ఆమె గండద్వితయ మువిూద లేగులాబీలను సృష్టించి, ... కోమలస్మితరుచులను వెలువరిస్తూ, ... కొంచెం ఛూకుడుగానే ... మంచం విడిచి ...

...భర్త విధించినదే అయినా, తనకూ సరదానిచ్చేపనే కాబట్టి,... ఆ దైనందిన రసోపేత ధర్మ నిర్వాహణానంతరం ... ఆమె, ... ... శయ్యామందిరం వీడి, ... వెళ్ళలేక, ... వెళ్ళ ... లేక ...... వెళ్లినా ...

ఆతడు మాత్రం ... అక్కడే, నిలువుటద్దం ముందు నిలువబడి,... వన్నెచిన్నెలు మధురభావనలో స్మరించుకుని, ... కులాసాగా క్రాపింగ్ సవరించుకుని, రెండు ... మూడు ... మారులు ... ఆవులించి, —— ఈలతో ... ఏదో ఆలపిస్తూ, ... ఈ జగతిలో వాడై పోయినాడు.

* * * *

కవి ననుకునేవాడు గనుక ... తత్కారణంగా విధివతు... కాఫీగత ప్రాణి గనుక, ఆ భూలోక సుధను ... పూర్తిగా సేవించి రోజ్ వుడ్ మేజాముందు...రాకింగ్ ఛైర్ లో సుఖాసీనుడై —— శ్వేతకాష్ఠోద్భూతధవళధూమరేఖాశిల్పాన్ని ...ఏకాగ్రతతో పరామర్శిస్తూ,... భావజగతిని విహరించడానికి రెక్కలు విప్పుకొనబోతూ, ఏదో అనూహ్యపుటూహాంచలముల నొరసుకొంటూ... మైమరచి, ఉపాసనవైఖరిని ... ఉండగా...

"చూశారా ... ఎంత అన్యాయమో...!

—— అధిష్ఠించిన ఉన్నతశిఖరాల మీదకు ... ఆమె మాటలు వినబడక పోయినా, ... ఎదురుగా నిలిచిన ఆమెను ... చూడనట్టుగా నటించలేక ...కృషిచేసి అలవరచుకున్న...కలల చూపులతో...

# ఎండమావులు

వెంపటి నాగభూషణం, యం. ఏ.

కు

హుఁ...

కుహూఁ...

కు ... హూఁ

— కలకంఠవధూకలకంఠరవానుకారి ...కాకలీధ్వని ... ఆ సుషుప్తిముద్రాలంకారమూర్తిని ...ఉహుఁ కదపలేదు.

ఓ... మదవతీనవమన్మథమోహనరూపా! ... సంతతరసానందసారస్వతకేళీలోలా! ... "

— అలా... ప్రబంధకవుల రచనాచమత్కృతులను ... తాత్కాలికంగా ఉపసంహరించి, ... మృదుమధురకంఠంతో, ...కొంచెం అధునాతనభావకవిత్వపు మజాతో ... ప్రబోధించేసరికి:

నాయిక పుణ్యఫలం ... స్వల్పంగా ఫలించి, ఆతడు ... కొంచెం అటునిటు మసలి...

— తిరిగీ నిద్దురలో కలసి మెలసిపోయి ...

ఇక ... మామూలు మేలుకొలుపులతో ప్రయోజనం లేదని, ... పాన్పును దరియబోయి, సిల్కు చతుష్కిని ప్రక్కకు తొలగించి, స్వీయబాహువల్లీకుశలవ్యాపారపారీణతను ... ఆతనికి చవి చూపి ఒక వైపునుంచి ఒక వైపుకు ఊగించి ... రెండు చెంపలమీదను, నెన్నొసటను చుంబనాలంకారములను...తోరహత్తుగా ప్రసాదించ:

ఆ ... రసికావతంసుడు ... తమాయించుకోలేక, జాగరణావస్థలోకి ట్రాన్సుఫరు అయి, ... అర విచ్చిన కన్నుదోయితో,— తనమీదకు ఒరగిలి, ... వైతాళిక విధిని నెరవేర్చి ... చిరునవ్వు చలువలు చిలుకరిస్తూన్న ... గృహిణిని విలోకించి ...

బ్రహ్మదేవుడు వ్రాసిన చరిత్రా, మానవుడు వ్రాసిన కథా ఈ రెండూ కలిస్తే మానవుడి ప్రపంచం అవుతుంది. మానవుడికి కేవలం అశోకుడి కథ, అక్బరు కథ, ఇవే నిజం అనేమాట సరిఅయింది కాదు. రాజుకొడుకు ఏడుసముద్రాలూ దాటి ఏడుగురు రాజుల డబ్బు సంపాదించాలని వెళ్ళడంకూడా సత్యమే. భక్తిచే ముగ్ధుడయి సంకోచించకుండా సంజీవిపర్వతం పెల్లగించుక వచ్చిన హనుమంతుడి వీరకథలూ సత్యమే. మానవుడికి ఔరంగజేబు యెంత సత్యమో దుర్యోధనుడు కూడా అంత సత్యమే. దేనిప్రమాణం అధికము? దేనిప్రమాణం తీసి కట్టు? అని లెఖలు కట్టకూడదు. ఏ కథ బాగున్నది? ఏ కథ బాగుండలేదు? ఇదే చూడాలి. బాగున్నదే అన్నిటికంటె మించిన సత్యము.

మానవుడు బ్రహ్మదేవుడి సాహిత్యంలోకూడా మానవుడే. అందుచే మానవుడు వస్తువులతోనూ చేయబడలేదు, తత్వంతోనూ చేయబడలేదు.

పంతులు చాలా ప్రయత్నం చేసీగూడా అబ్బాయిని ఈ విషయము నుంచి మరలించలేకపోయినాడు. ఆఖరికి చాలా హైరాన పడి నీతి ధర్మాలతోపాటు కథలను మిశాయింపు చేయటానికి తంటాలుపడ్డాడు. కాని చాలా కాలంనించి వస్తున్న స్వభావదోషంచేత యే విధంగానూ కలపలేకపోయాడు. కథా కరిగిపోతోంది. నీతీ నిర్మూలనం అవుతోంది. చెత్తాచెదారం చేరుతోంది.

విశాలభారత్ నుండి. అను: "రాజశ్రీ"



యను. గడ్డి మొలకెత్తింది. చెట్లు మొలిచాయి. పశువులు పరుగులె త్తాయి. పక్షులు యెగరటం మొదలెట్టాయి. కొన్ని భూమిలో బంధించబడి ఆకాశంవేపు అంజలి ఘటిస్తూ నిలిచాయి. కొన్ని విముక్తి పొంది ప్రపంచ మంతా నాదే అని తిరగటం మొదలెట్టాయి. కొన్ని నీళ్ళలో అట్టడుగున నిశ్శబ్దంగా గంతులు వేస్తూ ప్రపంచం అంతా ప్రదక్షిణం చేయడంలో నిమగ్న మయినాయి. కొన్ని రెక్కలు ఝూడించి సూర్యలోకంలోని అరుగులమీద పాటలు పాడుతూ అర్ఘ్యం ఇవ్వటంలో లీనమైనాయి.

ఈ ప్రకారంగా కొన్ని యుగాలు గడిచినవి. ఇంతట్లోకే ఒక రోజున అకస్మాత్తుగా యేం తోచిందో బ్రహ్మదేవుడు పంచవాయువుల్నీ పిలిపించాడు. వాటినన్నింటినీ కలిపి మానవుణ్ణి సృష్టిచేశాడు. ఇన్నాళ్లు గడిచింతర్వాత ఆయనకు కథలు చెప్పే సమయం వచ్చింది. చాలా రోజులు విజ్ఞానంలో గడిచేయి. శిల్పంలో గడిచేయి. ఇప్పుడు సాహిత్యం మొదలు పెట్టేడు.

మానవుణ్ణి కేవలం కథల్లోనే వికసింపజెయ్యటం ఆరంభించేడు. పశుపక్ష్యాదుల జీవనం— తినటం, నిద్రపోవటం, పిల్లల్ని కనటం: మానవుల జీవనం— కథలు, — ఎన్ని యాతనలు? ఎన్ని పరిస్థితులు? సుఖదుఃఖాలూ, రాగవిరాగాలూ, మంచిచెడ్డలూ యెన్ని ఆఘాతప్రతిఘాతాలు ఉన్నాయి?— ఒక కోరికతో ఇంకో కోరికకు, ఒకడితో అనేకమందికి, సాధనతో స్వభావానికి, ఆశతో పరిస్థితులకు కలిగే సంఘర్షణతో యెన్ని సుడిగుండాలు?— నదికి నీళ్ల ప్రవాహం మాదిరే మనిషి కథలకి ప్రవాహం వంటివాడు. అందుచేతనే ఒకర్ని వొకరు కలుసుకున్నప్పుడు “ ఏమయింది? ఏమిటి సంగతి? దాని తరువాత? ” అని అడుగుతారు. “ దాని తర్వాత ” తరవాత “ దాని తర్వాత ” యీ విధంగా అల్లుకుపోతే ప్రపంచమంతా మనిషి కథలతో గుచ్ఛెత్త వచ్చును. దీనికే జీవితకథ అని పేరు. దీన్నే మానవుడి ఇతిహాసం అంటారు.

దీనికి ప్రమాణం లేదు. కాని మూడు నాలుగులు పన్నెండూ అనే దానికి ప్రమాణం యెక్కడ బడితే అక్కడే దొరుకుతుంది.

అప్పటివరకు హనుమంతుడు ఆకాశంలో ఎగిరిపోతున్నాడు. చరిత్ర తనను యే విధంగానూ పట్టుకోలేనంత యెత్తు పోయాడు.

వీథి బళ్ళోనించి హైస్కూల్లోకీ హైస్కూలునుంచి కాలేజీకీ అబ్బాయిని పంపి మనస్సును పుటం పెట్టి శోధించడం ప్రారంభించారు. ఎన్నాళ్ళు పుటం వేసినా " కథ చెప్పవ్ " అనే మాట చావ లేదు.

౨

కేవలం చిన్నప్పుడే కాకుండా అన్ని వయస్సులలోనూ మానవుడు కథలలో పెరిగిన జీవం అని దీనివల్ల తెలుస్తోంది. ఇంచుచేతనే ప్రపంచమంతటా ఇంటింటా ప్రతియుగంలోనూ మానవుడు తాను సంపాదించిన ఇతర వస్తు సముదాయానికి తీసిపోకుండా బోలెడు కథలు— వ్రాసినవిగానీ, నోట చెప్పేవిగానీ కుప్పతిప్పలుగా వున్నాయి.

పంతులు వక విషయం బాగా ఆలోచించి చూడటం లేదు. కథలు వ్రాసే వ్యసనం సృష్టికర్త ఆఖరు వ్యసనం. కాబట్టి వాణ్ణి ముందుగా పుటం పెట్టి పరిశోధించకుండా, మానవుణ్ణి పరిశోధించాలని కోరడం కోరదగింది కాదు.

ఒక రోజున బ్రహ్మదేవుడు తన కార్ఖానాలో నిప్పునించి నీళ్లూ, నీళ్ళనించి మన్నూ తయారుచెయ్యటంలో నిమగ్నుడయాడు. ఆ సమయములో సృష్టి అంతా చెమటతో తడిసిపోయి ఆవిరితో కుతకుతలాడుతోంది. అప్పుడు లోహాలూ, రాళ్ళూ వీటి ఎన్నిక జరుగుతోంది. నాలుగువేపులా వస్తుసామగ్రి చెల్లాచెదరుగా పడివుంది. గడబిడగా కలగాపులగం అవుతోంది. ఆ రోజున బ్రహ్మదేవుణ్ణి చూసిన వాళ్ళు యెవళ్లూగూడా ఆయనలో ఇంకా చిన్నతనం వున్నదనుకోరు.

తరవాత ప్రాణుల్ని పుట్టించడం ఎప్పుడు ప్రారంభమయిందో తెలి

# క థ

## శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

అబ్బాయికి మాటలు రాగానే "కథ చెప్పవ్" అని అడిగాడు.

అవ్వ చెప్పటం మొదలెట్టింది.

"ఒక రాజు కొడుకూ, ఒక మంత్రి కొడుకూ, ఒక షాహుకారు కొడుకూ ......"

పంతులు గర్జించాడు "మూడు నాలుగులు పన్నెండూ"

కాని పిశాచం ఆయన కంఠం గట్టిగా పట్టించింది "హాః! హాః!! మింగుతా!!!" ఎక్కాల గోల అబ్బాయి చెవులకు ఎక్కలేదు.

శ్రేయస్సు కోరే వారంతా అబ్బాయిని ఇంట్లో కట్టేసి గంభీరంగా అన్నారు — "మూడు నాలుగులు పన్నెండూ ఇదే నిజం. రాజు కొడుకూ, మంత్రి కొడుకూ, షాహుకారు కొడుకూ అంతా అబద్ధం. అందుచేతా ......"

అబ్బాయి మనస్సు ఆ సమయంలో ఏడు సముద్రాలూ దాటి ఇంకా ముందుకు వెళ్ళిపోయింది. "మూడు నాలుగులు పన్నెండ్లూ" కూడ దాటుకు వెళ్ళిపోయిందని అనుకుంటే ఎక్కాల సంగతి ఎక్కడా అంతు తగల్లేదు.

హితైషి పంతులు [illegible]న్నాడు — "పిల్లడు బద్మాష్; బెత్తంతో వీణ్ణి బాగు చె[illegible] "

పంతులు పద్ధతి [illegible] ఊరుకుంది.

కాని అంతటితో [illegible] ఒకటి పోతే ఇంకొకటి వచ్చి కూచుంటోంది. [illegible] వచ్చి [illegible]యించింది. పాఠం మొదలెట్టారు. ఒక [illegible]ని వనవాసం కథ.

పిశాచం పరువు కాస్తా పోతోంది. పంతులు అన్నాడు "చరిత్రలో

• మహాకవి •



శ్రీ రవీంద్రులు



• మహర్షి •



శ్రీ అరవిందులు

దువల్ల మనకు తెలుస్తోంది. ఇటువంటి విద్రోహం చేసే అధికారాన్ని ప్రజలు కార్యరూపంలో కూడా పెట్టినట్లు మనకు చరిత్రవల్ల, సాహిత్యంవల్ల దృష్టాంతం కనిపిస్తోంది. ప్రజలు రాజ్యాన్ని విడిచిపెట్టి విదేశాలకి పోతామని భయపెట్టే నిరుపద్రవకరమైన ఆచారం ఒకటి ప్రచారంలో వుండేది. జనసామాన్యంయొక్క సభలో రాజునకు యెవ్వరయినా యేవిధమయిన సహాయంచేసినా వాళ్లు విశ్వాసఘాతకులుగా పరిగణింప బడతారని ప్రచురించే వాళ్లు. కాని ఆచారంలో యింకో ప్రతీకారం కూడా వుండేది. మంత్రుల సంఘము, లేక సాధారణ జనసంఘము యివి రాజును రాజ్యంలోనుంచి బహిష్కృతునిగా చెయ్యడం.

ఈ విధంగా భారతవర్షంలో నిర్మింపబడిన రాజతంత్రము కార్యకుశలము, కల్యాణకరము అయివుండేది. దీనికి ఒప్పగింపబడిన కార్యము చక్కగా నిర్వహింప బడుతుండేది. శాశ్వతంగా జనానుమోదం పొందేది. రాజతంత్రము ఒక విధంగా రాష్ట్రతంత్రముగానే ఉండేది. ఇది లోకప్రియ, ప్రభావశాలి అయినప్పటికి ప్రాచీనభారతవర్షంలో రాష్ట్ర-సమాజ వ్యవస్థలయందు రాజతంత్రమే ముఖ్యాంగముగా వుండేది కాదని గణతంత్రముయొక్క అస్తిత్వంవల్ల మనము తెలుసుకోగలుగుచున్నాము. మనము కేవలం రాజతంత్రముయొక్క విమర్శమాత్రముతోనే వూరుకున్నట్లయితే భారతవర్షరాష్ట్రవ్యవస్థయొక్క మూలనీతినిగురించి తెలిసికోలేము. రాజతంత్రము మాటున యేమి దాగివున్నదో దానినిగురించి పరిశోధన చేయడంవల్ల నే భారతీయుల రాష్ట్రవ్యవస్థయొక్క మూలస్వరూపాన్ని మనము తెలిసికోగలుగుతాము.



(మంత్రణపరిషత్తు) కేవలం విదేశీయులసంపర్కము, యుద్ధనీతి, శాం
తిస్థాపన మున్నగు వ్యవహారములను చర్చించుటలో రాజే ప్రధానపు
రుషుడు. శాంతిస్థాపన, రక్షణ సమాజంలో వ్యాపించిన దుర్నీతిని ని
వారించుట మున్నగు ఏకార్యాలు కేవలం రాజుద్వారానే చక్కగా
నిర్వహించుటకు వీలయ్యేవో అట్టి కార్యములను తన యిచ్ఛానుసా
రము చేయుటకు రాజునకే పరిపూర్ణ అధికారం వుండేది. ధర్మవిరుద్ధం
గా పోకుండా రాజునకు యెవరిమీదనయినాసరే అనుగ్రహము చూ
పించుటకును, నిగ్రహము చేయుటకును సమర్థత వుండేది. కాని యీ
సమస్త కార్యాలలో కూడా జనసామాన్యము యొక్క కల్యాణాన్ని,
ఉన్నతిని ఒకకంట చూచియే చేయవలసి వుంటుంది.

కాబట్టి ప్రాచీన భారతవర్షపు రాష్ట్రతంత్రములో స్వేచ్ఛాచారియ
గు రాజునకు యెట్టి అత్యాచారముగాని ప్రజాపీడగాని చేసేఅధికార
ము లేదు. చాలా ఇతరదేశాల చరిత్రలో వున్నటువంటి సర్వసాధా
రణమగు రాజులయొక్క పశుత్వము, నృశంస, అత్యాచారము భార
తీయ రాష్ట్రతంత్రమునందు తలంచుటకు కూడా అవకాశము లేదు.
ఐనప్పటికీ రాజు ధర్మాన్ని అగౌరవపరచి, రాజశాసనాన్ని దుర్విని
యోగపరచడంఅనేది అసంభవం కాదు. ఇందువల్ల రాజశాసనాలు
నిర్మించేవాళ్లు యీఅత్యాచారాన్ని నిరోధించడానికి ఒక యేర్పాటు
చేశారు. రాజపదవికి మర్యాదా పవిత్రతా ఉన్నప్పటికీ రాజు యథా
ర్థంగా ధర్మాన్ని అనుసరించనప్పుడు అతని శాసనాన్ని ప్రజలు గౌర
వించవలసిన బాధ్యత లేదని నిర్వచించారు. "అత్యాచారి,అన్యాయి
అయిన రాజుయొక్క హత్యచేయుట, పిచ్చికుక్కను చంపుటవలెనే
ప్రజలయొక్క కర్తవ్య" మని మనువు చెప్పాడు. ఆఖరికి రాజద్రోహ
ము, రాజహత్యా విధానము కూడా మనుసంహితవంటి శ్రేష్ఠ ప్రమా
ణగ్రంథంలో చెప్పబడి వున్నది. రాజునకు నిరంకుశాధికారము యి
వ్వడము, సర్వకాల సర్వావస్థలయందు రాజు ఈశ్వరప్రతినిధిగా అం
గీకరించడం భారతీయ రాష్ట్రనీతియందు ప్రత్యేకవిధానం కాదని ఇం

అసహనము, అత్యాచారము, వీటికి స్థానం లేదు. ఏ రాజన్నా వీటికి చోటిచ్చాడని అనుకోవడం కల్పనకు అతీతమయినవిషయం.

ధర్మకార్యాలవలెనే సామాజిక కార్యాల విషయంలోకూడా ప్రజల స్వాతంత్ర్యం పైన రాజు చెయ్యి వేసేవాడు కాదు. రాజు శాసనం ద్వారా సమాజంలోని ఆచారవ్యవహారాల్లో మార్పుచేసినట్లు యెక్కడా ప్రమాణాలు దొరకడంలేదు. ఎప్పుడయినా అటువంటి మార్పుజరిగినా ప్రజలయొక్క అనుమతి తీసుకొనియే జరిగింది. ప్రజలలో సంస్కారము, పరివర్తనము కేవలము బాహ్యాంగాయిచ్చినఅనుమతి మీదనే జరుగుటలేదు. లోపలనుంచే స్వభావంగా పరివర్తనమయ్యేది. ఒక కులానికిగాని, వంశానికిగాని తమ ఆచారాలలో పరివర్తన చేసుకొనుటకు యిచ్చిన సంపూర్ణ స్వాతంత్ర్యఫలమే బాహ్యా భ్యంతరముల స్వభావంగా సమాజంలో పరివర్తనాన్ని వికాసాన్ని కలిగించేది.

ఈ ప్రకారమే రాజ్యశాసనకార్యాల్లో కూడా రాజుయొక్కశక్తి జాతియొక్క సనాతన ధర్మ ఆదర్శముల ద్వారా పరిమితి పొందేది. ముఖ్యమగు రాజకోశం విషయంలో రాజు ఒక నిర్దిష్టమగు పన్నుకు అదనపుపన్ను వేయరాదు. యితర ఆదాయములవిషయంలోకూడా జనసామాన్యముచే నిర్ణయింపబడిన పెద్దలయొక్క అనుమతిమీదనే పన్ను నిర్ధారణ చేయవలసివుంటుంది. అన్నికాలాల్లోనూ జనసామాన్యముయొక్క సంతోషము, అనుమతి వీటి ఆధారముమీదనే రాజుయొక్క శాసనాధికారము నిర్మింపబడినదను విషయం సర్వసాధారణము. రాజు స్వయంగానే ప్రధానన్యాయాధిపతి పని చేస్తూ వుండేవాడు. దేశంలో ప్రచలితమైనటువంటి న్యాయాన్ని అనుసరించి శిక్షలను విధిస్తూ ఇతర న్యాయాధిపతులకు పయిన అధికారిగా ఉండేవాడు. అతని మంత్రిగణము, న్యాయాన్ని బాగుగా తెలిసిన బ్రాహ్మణవర్గం న్యాయముయొక్క స్వరూపాన్ని నిర్ధారణచేసిన విధాన్నే తాను ఆచరణలో పెట్టుటకు బాధ్యుడుగా వుండేవాడు. ఆలోచన సభలో

వారికి గురువు లున్నారు. రాజులున్నారు. తమతమ క్షేత్రాల్లో వీరు సంపూర్ణస్వతంత్రతతో నడవగలరు. పాలకుల మతం అనే పేరిట ఒక మతాన్ని ప్రత్యేకంగా అంగీకరించేవాళ్లు కాదు. ధర్మకార్యాల్లో కూడా రాజు జాతికి అధిపతి కాదు.

ఈ విషయంలో అశోకుడు దేశంలోని ధర్మంమీద తనరాజశక్తి ప్రభావాన్ని విస్తృతం చెయ్యడానికి ప్రయత్నించినట్లూ, యితరరాజులు కూడా అప్పుడప్పు యిటువంటి ప్రయత్నాలు చేసినట్లూ కనిపిస్తుంది. కాని ధర్మసంబధములగు విషయాల్లో అశోకుడు ప్రకటించిన అజ్ఞల (Edicts) ను కేవలం రాజ్ఞాలని చెప్పడానికి వీలులేదు. అవి కేవలం రాజుయొక్క మతాన్ని ప్రకటించేవిమాత్రమే. ప్రజలు వాటిని శిరసా వహించే తీరాలని వాటి ఉద్దేశ్యం కాదు.

ఏ రాజైనా ధర్మంలో యేమయినా మార్పు తీసుకుని రావాలని కోరితే మొట్టమొదట తనరాజ్యంలో వున్న ధర్మ విదులను పిలిపించి వారితో ఆలోచించి వారి అనుమతిని పుచ్చుకోవాలి. లేదా యీవిషయాన్ని చర్చించడానికి ఒకపరిషత్తును ఏర్పాటుచెయ్యాలి. ( బౌద్ధుల విచారసభాసమూహం యిందుకే దృష్టాంతరం ) విభిన్నమతస్థులను పిలిపించి యీ విషయం వాదవివాదాలు జరిపించాలి. అందులో ఏది సిద్ధాంతమయితే దానిని గ్రహించాలి. ఒక వేళ రాజునకు యే మత విషయం మీదనయినా అభిమానంవుండి పక్షపాతబుద్ధితో దానికి కావలసిన సమస్త సౌకర్యాలూ వారికి కలుగజేసినప్పటికీ బయటకి మాత్రం అతను విశేషజనం ఆదరించే మతాన్నే గౌరవిస్తూ దాన్నే సమర్ధిస్తూ సాధ్యమయినంతవరకు తాను నిరపేక్షుడుగా వుండాలి. ఈకారణంచేతనే చక్రవర్తులు పరస్పర విరోధములయిన హిందూ—బౌద్ధధర్మాల్ని సమానంగా సమర్ధిస్తున్నట్లు చరిత్రవల్ల కనిపిస్తోంది. అప్పుడప్పుడు ముఖ్యంగా దక్షిణదేశంలో రాజువల్ల మతానికి కొంత అపకారం కలిగినట్లు కనిపిస్తుంది. కాని చాలకొద్ది. అపవాదమాత్రం. సాధారణంగా భారతవర్షంలోని రాష్ట్రపాలనమందు ధర్మవిషయంలో

నూతనభావాల్ని, కార్యాల్ని సమర్థించడానికీ, నిరోధించడానికీ వారికి అధికారం వున్నదని మనం అంగీకరించాలి. రాజు ధర్మానికి రక్షకుడు, పాలకుడు, భృత్యుడుమాత్రమే. ఎవ్వరూ ఏమీ నేరాలు చేయకుండాను, ధర్మహాని చేయకుండాను ప్రజలందరూ ధర్మాన్ని అంగీకరించేటట్లు చూడవలసిన భారం రాజుమీద వుంది. మొదట రాజే స్వయంగా ధర్మబద్ధుడు కావాలి. రాజు తాను రాజకార్యాలను యే విధంగా పాలించాలో, వ్యక్తిగా యెలా జీవితం గడపాలో యీ విషయాల్లో ధర్మం నిర్వచించిన విధుల్ని కఠినంగా అనుసరించితీరాలి.

రాజుకొరకు నిర్వచించిన ఈ ధర్మము సత్యేతరమున్నూ, కాల్పనికాదర్శమున్నూ కాదు. ఊకదంపుడు మాటలు కావు. సమస్తమానవ జీవితం వస్తుతః ధర్మంయొక్క నిర్దేశాన్ని అనుసరించి పాలించబడటమే దీనికి కారణం. ఇది సజీవమగు సత్యం కాబట్టే రాజనీతిక్షేత్రమునందుకూడా దీని ప్రభావం పూర్తిగా వున్నది. అసలు ఏ విధమగు శాసనాన్నీ నిర్మించే అధికారం రాజుకు లేదు. ఆధ్యాత్మికం, సామాజికం, రాజనీతి, అర్థనీతి— వీటి ననుసరించియే, వాటి ఆదేశాల్ని శిరసా వహించియే రాజు దేశాన్ని పాలించాలి. ఇంతేకాకుండా దేశాన్ని పాలించడం తానొక్కడే ఒంటరిగా నిర్వహించేవాడు కాడు. ధర్మాన్ని సక్రమంగా ప్రచారం చెయ్యడానికి శక్తిసంపన్నములైన సంఘాలు దేశంలో ఇంకా వుండి రాజుకు తోడ్పడుతూ వుండేవి. ఇంకా ఈ పరిపాలనక్రమం ప్రజల యిచ్ఛకు అనుమోదంగా వుంటున్నదో లేదో ఒక కంట కనిపెట్టి చూస్తూవుండవలసిన బాధ్యత రాజుకు వుంది.

ఆధ్యాత్మికసాధన, పూజ, ఉపాసన మొదలగు పనులు చెయ్యడానికి అందరికీ స్వతంత్రత వున్నది. ఈ కార్యములను విఘ్నపరచడమునకు యెవరికీని అధికారం లేదు. ప్రతి ధర్మయుతసమాజానికీ, సంప్రదాయానికీ అది క్రొత్తగా పుట్టినా పురాతనకాలంనుంచి వస్తున్నా తన పద్ధతులను అనుసరించి పోవడానికి సంపూర్ణస్వాతంత్ర్యము వున్నది.

మీా అధికారం లేదు. అతడు తన అధికారాన్ని దుర్వినియోగంచేయ కుండా వుండగలందులకు అనేక ఏర్పాట్లు చేశారు.

దేశంలో వివిధ సంఘాలూ ఏర్పడి వాటి వాటి పద్ధతుల ననుసరించి రాజకార్యాల్ని నెరవేరుస్తూ వుండేవి. రాజ్యశాసనంలో వాటికిగూ డా కొంత స్థానం వున్నది. అవి ఒక విధంగా రాజుకు సహాయంచేసే రాజకార్యములను నడిపిస్తూవుండేవి. ఈ నాటి శాసనసభకు లోబడ్డ రాజు (Constitutional Monarch) వంటి రాజే ఆ నాటి భారతదేశ ములో ఉండేవాడు. కాని భారతవర్షంలో రాజును బాధ్యతాయుతు నిగ చేసి అతని అధికారాన్ని నిర్వచించిన మాదిరిగా యూరపుదేశ చరిత్రలో యెక్కడా కనబడదు. భారతదేశపురాజు రాజరికం చేయ డంలో ప్రజానుమతి పొందవలసిన విధి యూరపు దేశపు రాజులచరి త్రలో కనపడదు.

ధర్మము రాజుకుగూడా రాజు. ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, ఆ ర్థిక, న్యాయ, ఆచార, వ్యవహార, శాసనాది సమస్త విషయాలు జా త్యున్నతికొరకు దృఢంగా పరిపాలించడమే ధర్మమని భారతదేశంలో వ్యవహారింపబడేది. రాజు సంపూర్ణంగా ధర్మానికి అధీనుడు. ప్రజలు ధర్మాన్ని పవిత్రదృష్టితో చూసేవాళ్లు. ధర్మముయొక్క అధికారము నిత్యమనీ, సనాతనమనీ అంగీకరిస్తారు. అసలు మూలధర్మంలో ఏమీా పరివర్తన జరుగదు. కాని సమాజంయొక్క క్రమవికాసాన్ని అనుస రించి స్వాభావికంగా బాహ్యరూపంలో మాత్రమే గోచరిస్తుంది. దేశ భేదంవల్లా కులభేదంవల్లా కనిపించే ఆచారభేదాలు యీ మూలధర్మ ము లోనుంచి వచ్చినవే. ధర్మముపైన తనయిష్టాన్ని అనుసరించి హ స్తక్షేపంచెయ్యడానికి యెవరికీ యేమీా అధికారంలేదు. బ్రాహ్మణులు కూడా ధర్మానికి ప్రచారకులు మాత్రమే. వారు ధర్మాన్ని లిపిబద్ధం చేసేవారేగాని సృష్టిచేసేవారుకాదు. ధర్మాన్ని తమ యిష్టానుసారం మార్పు చెయ్యడానికి వారికికూడా అధికారం లేదు. కాని ధర్మానికి వ్యాఖ్యానము చేయడానికీ, తమ వ్యాఖ్యానముద్వారా సమాజంలో

కంగా శక్తిమంతాలే. కాని యావద్భారతదేశాన్ని ఒక త్రాటిమీద నిలపడానికి యేమీ చేయలేకపోయేవి. చిన్నచిన్న రాజ్యాల్ని అన్నిటినీ కలిపి యావద్భారతదేశాన్ని సంఘబద్ధం చెయ్యడం తేలిక పని కాదు. వస్తుతః ప్రాచీనకాలంలో ప్రపంచంలో యెక్కడా ఇటువంటి ప్రయత్నం సఫలం కాలేదు. పైగా కొంతకాలం ముందుకు సాగిపోయిన ఈ సంఘైక్యం సర్వత్రా నష్టమే పొందింది. ప్రపంచంలో ఇతరదేశాలమాదిరే భారతవర్షంలోకూడా రాజతంత్రమే క్రమంగా బలవత్తరమయిపోయింది. ఇతర గణతంత్రాలను కొలగించి తాను పీఠాన్ని ఆక్రమించింది. భారత-ఇతిహాసంనుంచి గణతంత్రం లుప్తమయిపోయింది. ప్రాచీనకాలపు నాణెములవలనను, గ్రీసుయాత్రికుల వర్ణనలవలనను రాజతంత్రస్థాపనకు సహాయపడ్డ ఆ యా కాలముల గ్రంథకారుల రచనలవలనను ఇప్పుడు ఈ విషయాల్ని తెలుసుకో గలుగుతున్నాము.

భారతవర్షంలో రాజు ఈశ్వరునికి ప్రతినిధిగా, ధర్మరక్షకుడుగా అంగీకరించబడి, రాజపదవి, గౌరవం, శక్తి కలిగి, ఉచ్చశిఖరం అధిష్ఠించి వున్నప్పటికీ ముసల్మానులు భారతవర్షం ప్రవేశించకపూర్వం వరకు స్వేచ్ఛాచారియగు రాజతంత్రం లేదు. రాజు తన యిష్టానుసారము నడవడానికి వీల్లేదు. పూర్వకాలంలో ప్రష్యా, మధ్య ఆసియా, పశ్చిమ-ఆసియా, రోమ్, యూరపు దేశాల్లో ఉన్నటువంటి నిరంకుశరాజతంత్రములకు భారతదేశ రాజతంత్రం పూర్తిగా భిన్నమైనది. పఠానులు, మొగలాయిలు భారతవర్షంలో చెలాయించిన రాజతంత్రానికీ ప్రాచీనభారతీయుల రాజతంత్రానికీ యేమీ పోలిక లేదు.

భారతదేశపు రాజు దేశాన్ని శాసించడమునకు, న్యాయపరిపాలనకు అధికారి. సమస్తసైన్యబలమూ వాని చేతిలో వున్నది. తన మంత్రుల ఆలోచనాసహాయంచేత యుద్ధం చేయడానికిగాని, శాంతిని స్థాపించడానికిగాని అతను సర్వాధికారి. సంఘకళ్యాణం కోసం సాధారణభావంతో సంఘాన్ని నిరీక్షణచేసేవాడు. కాని అతనికి వ్యక్తిగతంగా ఏ

# ప్రాచీన రాష్ట్రతంత్రము

## శ్రీ అరవిందయోగి

( ౮౧ వ పేజీ తరువాయి )

భారతదేశమందలి ఈ గణతంత్రం (రిపబ్లిక్) చాలా ప్రాచీనకాలము నందే ప్రతిష్ఠితమయింది. ఈ విధంగా క్రీ. పూ. ౬౦౦ సం|రములు వెనుకవరకు చాలా వైభవంగా నడిచింది. కాబట్టి గ్రీసుదేశంలో క్షణికమగు గణతంత్రం ఆవిర్భవించినకాలానికే భారతదేశంలో గణతంత్రం ప్రచారంలో వుండేది. మరిన్ని గ్రీసుదేశంలో గణతంత్రం లుప్తమయిపోయిన కాలంవరకు గూడా భారత దేశమందలి గణతంత్రం విరాజిల్లుతూనే వున్నది.

మధ్యధరాసముద్రమునకు ఆనుకుని వున్న చపలమనస్కులగు జాతుల కంటె భారతదేశప్రజలు సుదృఢమును, చిరస్థాయియు అగు రాష్ట్రవ్యవస్థయందు ఎక్కువ ఉన్నతస్థానమందు ఉన్నారనీ, భారతవర్షమందలి కొన్ని గణతంత్రములు ప్రాచీనకాలపు రోమ్‌కంటె చాలకాలం తరవాతవరకూ ఐశ్వర్యంతో తమ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ భారతదేశాన్ని సమర్థతతో రక్షించుకుంటూవుండేవనీ, మనం అంగీకరించకతప్పదు. ఎందువల్లనంటే: వారు చంద్రగుప్తుడు మొదలైన ప్రబల ప్రతాపవంతులయినవారి సామ్రాజ్యాలకు ఎదురుగా తమ అస్తిత్వాన్ని అక్షుణ్ణంగా నిలబెట్టుకున్నారు. క్రీస్తుకి తరవాతగూడ చాల శతాబ్దులపర్యంతం రాజ్యమేలారు. రోమ్ మోస్తరు తమ శక్తిసామర్థ్యాలను ఇతరరాజ్యాలపై దండెత్తి జయించడానికి వినియోగించలేదు. తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడంతోను, స్వతంత్రభావంతో తమ జీవితాల్ని వికసింపజేసుకోడంతోను సంతుష్టులయేవాళ్లు.

అలెగ్జాండరు దండయాత్రకు పిమ్మట భారతవర్షం సంఘబద్ధం కావలసిన ఆవశ్యకతను గుర్తించింది. కాని ఆ కాలంలో ఉన్న గణతంత్రములు ఈ సమ్మేళనానికి విరుద్ధంగా నిలిచాయి. అవి ప్రత్యేకప్రత్యే

ఎచటి కేగుచునుంటివోయీ!
ఈ గభీరనిశీథమందున?
ముందువెనుకల నెవరు లేరే
యెందు బోయెదవు?

* * *

నడచుచుందును ముందునకు నే
నడచుచుందు నిరంతరంబును;
ముందువెనుకలగూర్చి చింతన
డెందమున లేదు!

ఇందు కవికంటె భిన్నులు ఇద్దరున్నారు. కవి దీనిలో పాత్ర కాదు. కవి తన్ను పాత్రలయం దారోపించుకుని తన భావాలకు అవి బాధ్యత వహించేటట్లు చేశాడు. ఇది ఆభాసభావకవిత.

పవనపులకితచంద్రాతపప్రఫుల్ల
చారుశారదయామినీసమయమందు
పీధివీధుల మధురలో వెదకి వెదకి
చేరుకొంటి బృందావనసీమ నేడు.

భాషిస్తున్నది ఒక్క పాత్రయే ఐనా ఇందునూ కవి గాక రెండు పాత్రలున్నట్లు కనబడుతోంది. ఇదీ ఆభాసభానకవిత్వమే.

ఈ పరిష్కారాన్నిబట్టి ఏ కవి ఏ ప్రక్రియను ఉత్తమంగా నిర్వహించగలడో గ్రహిస్తే నస్తుకవిత్వరచనకు వారివారి అర్హతలు నిర్ణయించవచ్చు. పరభావకవి ఆఖ్యానాలను, ఆభాసభావకవి నాటకాలను బాగా వ్రాయగలరని స్థూలంగా చెప్పవచ్చు. ఆత్మభావకవిత ప్రాతిపదికగా పరభావకవిత, ఆభాసభావకవిత అభ్యసించడం క్రమపద్ధతిగా కనబడుతుంది. ప్రపంచవాఙ్మయవికాసాన్ని విశాలదృష్టితో సింహావలోకనం చేస్తే ఇదే సక్రమపరిణామ మని తెలుస్తుంది.

టిది ప్రత్యక్షభాషణం. రెండవది పరోక్షభాషణం. మూడవది సంభాషణం.

ఈ విభాగం ఉదాహరణలవల్ల యింకా స్పష్టం కాగలదు.

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమాసుధాగానమంజువాటి;
ఏనొక వియోగగీతికను...

ఇందు కవి ప్రత్యక్షంగా తన విషయం నివేదించు కుంటున్నాడు. ఈ పద్యభావం కవికి కేవల మాత్మీయం.

ఇది పరానురక్తమగుచు నా యెద జనించి
తావకాలయఘంటికా ధ్వానపథము
లందు బడి యభ్రవీథుల యంచులెరుగు
తలపు: వేగింపబడెద నిత్యంబు నాథ!

ఇది ప్రక్రియలో కొంత నాటకమువలె ఉన్నా, ఇందులోని భావము కవిదే. ఇదీ ఆత్మభావకవిత్వమే.

అవి ధరాగర్భమున మానవాస్థికా ప
రంపరలు; సుప్తనిశ్శబ్దసంపుటములు;
అట నొకే దీర్ఘయామిని; ఆ నిశాశ్మ
శానశయ్యకు ప్రాతఃప్రసక్తి లేదు.

ఇట కవి ఆత్మభావాన్ని గాదు చెప్పేది. ధరాగర్భాన మానవాస్థికల సంగతి చెబుతున్నాడు. వాటి స్థితిని తనయం దారోపించుకుని వాటి భావాలకు తాను బాధ్యుడౌతున్నాడు. ఇది పరభావకవిత.

హేమపాత్రల చందన మెండిపోయె,
ద్వారములు మోయుచున్నవి హారములను,
సానలందింకె స్నానకషాయగంధ
మబల! యెవనికోసము సగమై కృశింతు?

ఇదియు పక్కీలో నాటకంలాగ వున్నా తత్వతః పరభావకవిత్వమే.

# భావకవిత్వం

పాటిబండ మాధవశర్మ, యం. ఏ. (ఆనర్సు)

౧

విద్యమానమయిన భావకవిత్వమంతా ఒకే విధంగా లేదు. పరిశీలన సౌకర్యం కోసం దీన్ని కొన్ని రాసులుగా ప్రక్రియాభేదాన్నిబట్టి పరిష్కరించుకోవాలి.

కవిత్వం అనేది ఒక సాధారణవాచకం. భావకవిత్వం దానికి ప్రాతిపదికరూపం. ఇది శుద్ధకవిత్వం అని చెప్పబడ్డది. ప్రయోగవిశేషమును బట్టి ఆఖ్యాన నాటకాది ఏ కవితాప్రక్రియలోకైనా సుళువుగా ప్రాకిపోగల సాధువు.

భావకవిత్వం మనఃప్రధానం. కవి అంతర్ముఖుడై చేసే సృష్టి భావకవిత్వం. కవి తన విషయాన్ని తానే తనకే చెప్పుకుంటున్నాడు. ఇదే శుద్ధకవిత్వం (Pure Poetry). ఆఖ్యానము, నాటకము ప్రయుక్తకవిత్వం (Applied Poetry). శుద్ధకవిత్వానికి కొంత వర్ణనాంశము కలిపితే ఆఖ్యానం అవుతుంది. దీనిలో కవికంటె భిన్నమైన ఇంకో వస్తువు ప్రసక్తి వస్తుంది. ఇది పరభావకవిత్వం. శుద్ధకవిత్వం అన్నది ఆత్మభావకవిత్వం అనవచ్చు. కవికంటె భిన్నమైన ఒక వస్తువు తన భావాలను ఇంకో వస్తువుతో చెప్పుకుంటున్నట్లున్నది నాటకం. ఇక్కడ కవిగాక ఇంకా రెండు పాత్రలు ఉన్నవి. పరభావకవితలో కవిగాక వేరే వక్కటే పాత్ర. ఆత్మభావకవితలో కవి వక్కడే పాత్ర.

ఆత్మభావ, పరభావ కవితలకు భిన్నమైన ఈ మూడో జాతిని ఆభాస భావకవిత అని వ్యవహరింతాము. ఆత్మభావకవితలో కవి తనకుతానే నిలుస్తున్నాడు. పరభావకవితలో వేరొక వ్యక్తిని తనయం దారోపించుకుంటున్నాడు. ఆభాసభావకవితలో తన్నే వేరొక వ్యక్తియం దారోపించుకుంటున్నాడు. మొదటిది ఉత్తమపురుష కవిత్వం. రెండవది ప్రథమపురుష కవిత్వం. మూడవది మధ్యమపురుష కవిత్వం. మొద

సుడవు. పిశాచానివి. దయ్యానివి. ”

చురకత్తులు గ్రుచ్చిన కొరడా చివళ్లు కాళ్ళకూ చేతులకూ సంకెళ్లు వున్న రామసింగు వీపుమీద నెత్తిమీద ఛెడేల్ ఛెడేల్ మని పడ్డవి.
“ ఇంకా అంటావా? ”

“అంటాను. నానోటివెంట మాట వచ్చేవరకూ అంటాను. నీవు గాడిదవు. పందివి! నీకు నీతిలేదు. జాతిలేదు. నీ ముఖాన ఉమ్మివేయవలె!”
షాహి చేతులో వున్న కొరడా రామసింగు మెడకు ఉరి పోశాడు బిగించాడు. ఇనప బొడిపెలు కలిగిన చెప్పులతో షాహి రామసింగు ఆయములలో పొడిచాడు. రామసింగుకి ఊపిరాడలేదు. షాహి మళ్ళీ అన్నాడు “ ఏమిరా! యింకా అంటావా? ”

రామసింగు పెదవుల సందునుంచి మాటకాని మాట పెదవుల కదలికనుబట్టి గ్రహించవలసిన మాట వచ్చింది. “నీవు నమక్ హరామ్! ఔరత్ కా ఢాకూ! ”

షాహి కొరడా పిడివేపున చికిలిచేసిన జానెడు పొడుగు కత్తి వున్నది. అది రామసింగు కణతలలోనుంచి ఒకవేపునుంచి ఇంకోవేపుకి దూసుకునిపోయింది. రామసింగు కళ్ళూ, నాలికా బైటకు పొడుచుకువచ్చినవి. అవి “ నమక్ హరామ్! ఢాకూ! ” అన్నవి.

౭

తరవాత వారంరోజులు ఒకటే సోమవారం! అప్పటికి మళ్ళీ సోమవారం చిన్న ఆదివారంగాకాకుండా సోమవారంగా వచ్చింది. షాహి పెద్ద సభతీర్చాడు. ఉమ్రావులు రాజాధిరాజరాజపరమేశ్వరు డన్నారతన్ని. సామంతులు అల్పనృపచంద్రమఃకిరణదాత అన్నారతన్ని. కవులు దయానిధి, కరుణాసాగరుడు అన్నారు. అప్పుడే ఒక శుభవార్త వచ్చింది. ఢిల్లీనుండి మక్కాకు, రామేశ్వరమునుండి కాశీకి తీర్థయాత్రికులకు షాహి రోడ్లు వేయించి ప్రక్కన చెట్లు వేయించాడు. లోకబంధువు! జగదుద్ధారకుడు!! మహాదైవభక్తిపరాయణుడు!!! అల్లా కే ఫకీర్!!!! అన్నారు.

బయటికి తెప్పిస్తాడు. "ఏమిరా! నీ కేమి అపకారం చేశాను?" అంటాడు. రామసింగు షాహీని వందలు, వేలు. లక్షలు, కోట్లు తిడ తాడు. "ఒరేయ్! నీవు షాహీవా? నీవు పశువువు. నీవు నమక్‌హా రామ్‌వి! నీవు గాడిదవు! దైవం నీకు రాజ్యం యిచ్చాడు. నీకు బుద్ధి లేదు. అధికారం వుందికదా అని ఆడుతున్నావు. ఎప్పుడూ రాయల్లే బ్రతికి వుండవు. చస్తావు! నా వుసురు తగిలి పోతావు!!" అంటాడు. సిద్దీవాళ్ళు, ఖొజ్జావాళ్లు కొరడాలు పుచ్చుకుని రామసింగుని కొడతా రు. స్మృతిచెడి పడిపోయేవరకూ రామసింగు తిడతాడు. వాణ్ణి ఖైదు లో వేస్తారు.

ఇట్లా అనేక సోమవారాలు గడిచినవి. ఒక సోమవారం ప్రొద్దున్నే షాహీ వచ్చాడు. అప్పటికి సోమవారాలు కొన్ని వందలైనవి. ఏ సోమవారమూ కూడా రామసింగుకి బుద్ధి తెప్పించలేదేమి? షాహీకి చాలా కోపం వచ్చింది. సోమవారం అన్న పేరు, రామసింగు అన్న పేరు ఇవి రెండూ షాహీ ప్రాణాలమీద కూర్చున్నవి.

రామసింగన్నా తుడుచుకు పోవాలి. సోమవారమన్నా తుడుచుకు పోవాలి. షాహీ పండితుల్ని పిలిపించి సోమవారాన్ని బర్తరఫ్ చెయ్యా మన్నాడు. వాళ్లు "ఆదివారం సోమవారం కలిపి వొక్కటే. మొద టిది పెద్దఆదివారం, రెండోది చిన్నఆదివారం" అన్నారు. లోకంలో అల్లా ప్రచారం సాగింది. ఈ సోమవారం పల్లెటూళ్లల్లో పోయి దా క్కుంది. పూర్తిగా చచ్చింది కాదు. చిన్న ఆదివారానికి వ్యాకరణం మాదిరి స్థానివద్భావం పట్టింది. అది పేరుకి చిన్నాదివారమైనా సోమ వారమల్లే పనిచెయ్యడం మొదలు పెట్టింది.

షాహీకి తెలిసింది రామసింగు పోవలసిందే కాని సోమవారం పోదని. కొరడా తాను స్వయంగా చేత్తో పుచ్చుకొని వెళ్ళాడు రామసింగు దగ్గరకు.

"ఏమిరా! యింకా అంటావా?"

"నా గొంతుకలో ప్రాణమున్నంతవరకంటాను. నీవు రాక్ష

జొరల్ కా ఢాకూ అన్నాడు. నలుగురూ నవ్వేరు. షాహి పెదవుల లో నవ్వేడు. కన్నులలో నిప్పులు క్రక్కేడు. ఉగ్రమావులు, కవులు అతని కనులు ఇంద్రనీలమణు లవడంచేత కొరివిగా వున్న రామసింగు ఆ కన్నులలో ప్రతిఫలించి ఆ కళ్లు అట్లా కనిపించాయే కాని, హిమానీ బిందు తిరస్కారులైన ఆ కళ్ళల్లో అసలు నిప్పులెట్లా వుంటాయని అన్నారు. వృథాగా మొరిగి మొరిగి రామసింగు బయటపడ్డాడు. అందరూ రామసింగును ఖైదు చెయ్యాలన్నారు. షాహి కూడదని వదలి పెట్టించాడు.

౫

రామసింగు అప్పు డప్పుడు పిచ్చివాడుగా వీధుల్లో కనబడతాడన్నారు కొందరు. చాలామంది మేము చూశాము లేమ మేము చూశా మన్నారు. ఆ మహాపురుషుడైన షాహికి ఈ వెధవ జోలి పట్టిందా? అన్నారు కొందరు. ఇతర వూళ్ళనించి వచ్చినవాళ్లు రామసింగుని ఆ వూళ్ళో చూశామన్నారు. కొందరు ఉగ్రమావులు రామసింగు తమ వూళ్ళోవున్నాడనీ, అతనెప్పుడూ షాహిని తిడుతున్నాడనీ తామతన్ని ఖైదుచేసేవారేగాని షాహి కిష్టంలేని పని చెయ్యడ మెందుకని మానివేశామనీ చెప్పారు. షాహి కొలువులో రామసింగు పేరు కొన్నాళ్ళు నవ్వులాట లైంది. మరీ షాహి అంటే దేవుడే అనుకున్నవాళ్ళకి కోపహేతువైంది.

౬

నిజంగా రామసింగు కోటలో ఒకమూల ఒక చీకటికొట్టులో పడివున్నాడు. కొరివి కాకుండా కాగడా కాకుండా షాహి యెదటికి వెళ్ళి పొగచూరుతూ మండుతూ యే రోజున నిలబడ్డాడో, బహిరంగమైన సభలో దయామయుడైన ఆ షాహిచేత ఏనాడు వదలిపెట్టబడ్డాడో ఆ రోజున రాత్రే రామసింగు ఈ కోటలోని చీకటికొట్లోకి చేరాడు. షాహి ప్రతి సోమవారం రాజకార్యాలు చెయ్యడు. ఆ రోజున ప్రొద్దున్నే రామసింగు వున్న చీకటికొట్టుదగ్గిరికి వెళతాడు. రామసింగుని

జాగీరంతా షాహి కాజేశాడని. షాహితో బోయి మొరపెట్టుకున్నా డు. షాహి అరమోడ్పు కన్నులతో రామసింగ్ దీనాలాపాలు విన్నా డు. మంత్రులన్నారుకదా "జగత్ప్రభువు దయామయుడు. నిరుద్దిక్ష పామపాపానికి నీ జాగీరెందుకు? ఏదో కొంత వ్యవహారం కొరకు తీసు కున్నాడు గాని నీ జాగీరు నీకే యిచ్చేస్తాడు." అని.

అయిదారు నెలలు గడిచింది. ఇప్పుడు రామసింగుకి తిన తిండి లేదు. కట్ట గుడ్డ లేదు. ఆ నవాబు విడిదిలో వుంటున్నాడు. జాగీరు వున్న ప్పటి జవాహిరీ, ముఖమల్ గుడ్డలు, పట్టుగుడ్డలు బయటికి తీసి వాడు కుంటున్నాడు. రోజూ షాహి దర్శనానికి వెళతాడు. షాహి దర్శనం కాదు. తిరిగి వస్తాడు. బంగారపు గిండులు, వెండి పళ్లాలు, జరీ సేలు వలు, అమ్మకమై పోతున్నవి. తిండికి పెటపెట లాడుతున్నాడు.

౪

మళ్లీ ఆరునెలలైన తరువాత, రామసింగు కింకో విషయం తెలిసింది. రామసింగు భార్య షాహి అంతఃపురంలో వున్నది. ఎట్లా వెళ్లిందో తెలియదు. తా నింట్లో లేనప్పుడు షాహి రౌతులు వచ్చి బలవంతం గా మేనాలో ఎక్కించుకుని తీసుకుపోయారని యిరుగుపొరుగువాళ్లు చెప్పారు. కొందరు ఆవిడకుయిష్టమై వెళ్ళిందన్నారు. కొందరు నవా బుకీ ఆవిడకీ సంబంధం రెండేండ్లబట్టీ వున్నది. ఇది క్రొత్త యేమిట న్నారు. రామసింగు ఒళ్లు అదివరకే దారిద్ర్యమనే గ్రీష్మాతపం చేత యెండుకట్టై అయింది. ఇప్పుడు నిప్పుపుల్ల తగుల్కొనేసరికి భగభగా మండింది. రామసింగు కాగడా, కొరివి గాని స్థితిలో వహారాలు దూ స్తుకుని షాహియెదట నిలబడ్డాడు. షాహిచుట్టూ నవాబులు, ఉమ్రా వులు, కవులు, సామంతులు ఉన్నారు.

ఒకరు సర్వభారత క్షోణీమండలాధిపు డన్నారు. ఒకరు సామంతనృప మౌళి మణి మండిత పదనఖ దీప్తి అన్నారు. మరొకరు కవిలోక దీన జన చింతామణి అన్నారు. ఆ మధ్య రామసింగు షాహిని కర్కోటకు డన్నాడు. గోముఖ వ్యాఘ్ర మన్నాడు. నమక్ హరామ్ అన్నాడు.

తారపురుషుడన్నారు. తురకలు మహమ్మదంటే హిందువులు రాముడన్నారు. కొన్ని చెరువులకు కట్టలు పోయించాడు. కొన్ని బాటలకు వంతెనలు కట్టించాడు. బేగీరావు టపా పెట్టింది అతనే. భూలోకం స్వర్గముఖంగా పోతోందన్నారు. కల్పవృక్షమూ, కామధేనువూ రెండూ అబద్ధం, నిరుద్దీన్ ఒక్కటే నిజమన్నారు.

జైనూల్ ఒక రోజు సాయంత్రం దౌలత్ మహల్‌లో పై యంతస్తు మీద బంగారపు కోళ్లు, రతనపు పని కల దంతపు మంచం మీద పడుకున్నాడు. అచ్చబంగారు నక్కీ అంచు మరకతాలూ, వజ్రాలూ ఎడమెడముగా పొదిగినట్లు పనిచేసిన ముఖమల్ దుప్పటి పరుపుల మీద వేసివున్నది. షాహీ పడుకున్నది దానిమీద. రెండంతస్తుల క్రిందనించి దౌలత్ మహల్ కాళ్ళకి తగుల్తూ పోతూవున్న యమునానది తన పై ప్రవాహం మీదినుంచి వెళ్ళే గాలిని జైనూల్ కళ్ళల్లోకి కొడుతోంది. దుప్పటి నక్కీ అంచు ఎగిరి జైనూల్ కళ్ళకి నీరాజన మిస్తోంది. యమునానది తన నల్లని ఛాయ ఒక తేజోలేశంగా పై కగరకొట్టి షాహీ యౌవనచిహ్నమైన గడ్డంతో సరాగ మాడుతోంది.

అప్పుడు విదియచందురుడు క్రుంకబోతున్నాడు. నిరుద్దీన్ మనస్సులోకి ఏదో వక వూహ వచ్చింది. అతడు వెంటనే సేవకుణ్ణి పిలిపించి మంత్రికి కబురంపించాడు. మంత్రితో వక మాట చెప్పాడు

## 3

తరువాత వారం రోజులకు రాజధానికి ఏబది మైళ్ళ దూరంలో వున్న ఒక పట్టణంనుంచి ఒక చిన్న జాగీర్ దారు తన కుటుంబంతో రాజధానికి వచ్చాడు. అతడు మొదట రెండు మూడు నెలలు మిక్కిలి గౌరవం పొందాడు. ఆ జాగీర్ దారు పేరు రామసింగు. ఆ రామసింగునకు తరువాత ఏదో అనుమానం పుట్టింది. సంవత్సరం గడిచింది రామసింగొక రోజున హఠాత్తుగా ఒక సంగతి తెలుసుకున్నాడు. తన

# అల్లా కే ఫకీర్

విశ్వనాథ సత్యనారాయణకవి, యం. ఏ.

౧

జైనూల్ ఇ-నిరుద్దీన్ రాజ్యానికి వచ్చాడు. అతడు రాజ్యానికిరావటం లోకమంతా వాంఛించింది. ఎందుకంటే, అతను యువరాజుగా వున్నప్పుడు మంచి దైవభక్తుడుగా కనిపించాడు. పేదవాళ్లకు ఉపకారం చేశాడు. అమిత జాలిగుండెవాడని పేరుపొందాడు. ఒకసారి అతను నాల్గుగుర్రాల బండిమీద పోతుంటే ఒక కుక్క దానిక్రింద పడి కంయి కంయిమని మొత్తుకుంది. అతను బండి ఆపించి దిగి దాన్ని చూసి జాలిపొంది దానికి వైద్యము చేయించాడు. ఉత్తరత్ర అది చస్తే దానికి పెద్ద సమాధి కట్టించాడు. ఇది ఖిల్లాబజారులో జరిగింది. జనం గుంపులుగుంపులై చూశారు. ఇదివరకునవాబులు అట్లా మనుష్యులు పడి చచ్చినా లెక్కచేసేవాళ్లు కాదు.

అతను మహాత్ముడుఅవతారం అన్నారు. అతడు విద్యాపోషకుడు, కవి పండిత పక్షపాతి అన్నారు. ఎప్పుడూ కవులు వ్రాతకాపీలు పుచ్చుకుని యువరాజు సౌధంచుట్టూ మూగేవారు. ఆయన కొందరు కవులను గౌరవించేవాడు. అందరూ ఆయనకన్న రసజ్ఞులు లేడన్నారు. ఈయన రాజ్యానికి వచ్చాడంటే జనం యెందుకు సంతోషించరు? ఆయనలో కొంత క్రూరత్వం వుందన్నారు కొందరు. ఆ మాట లెవ్వరూ విశ్వసించలేదు. అక్కడక్కడ కొందరు చెవురుగా ఆయన్ని పరమ రాక్షసుడన్నారు. ఈ మాట లెవ్వరూ వినిపించుకోలేదు. ఈ మాటలు బాగా ఎవరన్నా వింటే అన్నవానికి వెంటనే శాస్తి అవుతూ వచ్చింది.

౨

జైనూల్ రాజ్యానికి వచ్చిన మొదటి యేడాదిలో అతను దేశానికి చాలా లాభం చేశాడు. తలపన్ను తీయించాడు. జనం ఆయన్ని అవ

పగడంబుల్ గొని తెచ్చి గట్టుపయిఁ జేర్పం జెల్లు క్షీరాబ్ధిలోఁ
దగ నిద్రించెడు మాయకాని చరణద్వంద్వంబు దర్శింప నిం
పగు భృంగంబుల గీతి మార్మ్రోలయు పొల్పౌ వేంగడంబందు సం
పగె వృక్షంబయి నిల్చునంతటి మహాభాగ్యంబునుం గాంతునో!

కంపిలఁ జేయు మత్తకరికంఠమునన్ వసియించు భాగ్యముల్
పొంపిరివోవు సంపదలు, భూరమణత్వము నొల్ల నేను; ఆ
యింపుల దైవమైన జగదీశునిదౌ తిరువేంగడంబునన్
దెంపగు తంబకంబగుచు నిల్చి తపంబున ప్రాప్తిఁ గాంతునో!

మెఱపుల కాంతి నెన్నడుము మేకొన నూర్వశి మేనకాది సుం
దరులొనరించు నృత్యసహితంబగు గానము నాదరింప; బం
భరములు ఝంకృతుల్ సలిపి పాడెడు వేంగడమందు నాటిలే
కరుదగు నొక్క పైడి మలయేఱు తపమ్ముం గలవాడ నౌదునో!

నెలయుంబోల్ ధవళాతపత్ర మొలయన్ నే రాజరాజంచు లో
కులమెద్దన్ నుతులందునంత సిరి నాకుం గోర్కెయే లేదుసూ;
అలరుందేనెల పూవనుల్ వెలయ నింపౌ వేంగడంబందునన్
సెలయేఱై ప్రవహించు భాగ్యగరిమన్ జెందంగ నేఁ గాంతునో!

బాలశశాంకశేఖరుఁడు, బ్రహ్మయు, నింద్రుడు జేయునట్టి పె
న్వ్రేలుములెల్లఁ గాచునను వేదములందునఁ దోఁచుచుండు గో
పాలుని తావులొల్కు వనవాటము లొప్పెడు వేంగడంబుపై
నేలను ద్రోవనై నిలుచు నిల్కడ నా కొనగూడఁ గాంతునో!

పాపఫలంబులైన భవబంధములం దెగఁద్రెంచు దేవదే
వా! పురుషోత్తమా! సిరివరా! తిరువేంగడ! నీదు వాకిటన్
నీ పద భక్తులున్, సురలు, నిర్జరకాంతలు మూగియుండు మె
ట్లై పడియుండి కాంచఁగలనౌమనో నీ పవడంపు మోవినిన్!

సురలోకంబుల నేలఁగాఁ గలిగినన్ జొక్కంపుఁ బొన్నూలితో
బిఱుఁదుల్ దోపఁగ నూర్వశీప్రముఖులే వేఁడంగ నేనొల్ల; నెం
బెరుమాన్ దా నరుణాధరంబొలయఁగా వెంచేసియున్నట్టి బం
గరు కొండన్ దిరువేంగడంబున నెదే గానిమ్ము కాఁ గోరెదన్!

# పాశుర పరిమళములు

## ౧. తిరు వేంగడము

[ తిరువేంగడము అను నీ శబ్దము తెనుఁగు భాషకు నూతనమయినది; కేవలము ద్రావిడపదము. 'తిరుమల' యని సాధారణముగాఁ బేర్కొనఁబడుచుండు శ్రీ వేంకటాచలమునకు నామాంతరము. దీనిని అకారాంత పుంలింగశబ్దమువలెనే వాడుకొనవచ్చును. "తిరు" అనునది శ్రీ శబ్దమునకుఁ బర్యాయము గావున "వేంగడము" అనియును బ్రత్యేకప్రయోగము.

శ్రీ కులశేఖరాళ్వారులు తమకుఁ దిరువేంగడంబునందు గల యాదరములను నిండారు భక్తి విలసిల్ల నొక పది "పాశురము"లఁ బాడి భక్తకోటికి వెల్లడించియున్నారు. ఆ పాశురములు "నాలాయిరము (4000) దివ్యప్రబంధము" లో నిమిడియున్నవి.

"ఊనేఱుశెల్వత్తు" అను ప్రారంభము గల పది పాశురములకు నిది తెలుఁగు. ఇవి "పెరుమాళ్ తిరుమొழి" లో నాలవ తిరుమొழి పాశురములు. పాశురశబ్దముగూడ ద్రావిడశబ్దమే: పాటయని యర్థము. వ్యుత్పత్తి: పా = విస్తృతమైన, శురం = స్వరము. ]

మాడభూషి మతము వేంకటాచార్యులు

కోరిక గిబ్బ లేడిటినిఁ గూల్చినయాతని సేవకంటె నే
గోరను క్రొవ్వునైఁ బెఱుఁగు కోమలదేహముతోడి పుట్టువున్;
దేఁటిన సయ్యతో వెలయు దేవుని యా తిరువేంగడంబునన్
జేరి సరోవరంబున వసించెడి పిట్టగఁ బుట్టఁ గాంతునో!

ఆనని చెల్వ మొప్ప నమరాంగన లెప్పుడుఁ జుట్టి కొల్వగా
నే నల స్వర్గమేలు సిరియేని, యిలేశతయేని యొల్లఁ; గ్రొం
దేనెల పూవుఁ దోఁటలను దీరగు వేంగడమందునన్ దొనన్
మీనమునై చరింపఁగల మేటి విధిన్ బడయంగఁ గాంతునో!

అల్లికవడ్డ పెంజడలయాతడు, నల్వయు, వేల్పుఱేఁడు దామల్లనఁ జేరి ద్వారమున నందఱుఁ గిక్కిఱియంగఁ బెల్లు శో
భిల్లెడు చక్ర మొప్పు తిరువేంగడనాథుని యుమ్మిపాత్ర మ
ల్లలనఁ గొంచు లోనరిగి యాతని సన్నిధిఁ జేరఁ గాంతునో!

# అమెరికా కవులు

అక్కటకటా! ఎంత అన్యాయ మన్యాయ!
మమెరికాలో కావ్య మచ్చు కావలె నన్న,
ఇచ్చగింపగ నేర డే ప్రకాశకు డంట!
ఇంతకన్నను మహాహీనస్థితి వినుండు:
పద్యపాదా లెట్లొ పత్రికాముఖమునం
బ్రకటింప దలచుచో పైసా కవీశుడే
ఇచ్చుకోవలెనంట ఏ పత్రికకునైన!

సంయుక్తరాష్ట్రాల సాంద్రనీహారంబు-
చందాన ధనపిశాచం బావరించినది.
పాప, మచ్చటి కవుల్ బ్రతుకు మార్గము లేక
పట్టణంబుల చతుష్పథము లూడ్చెదరంట!
భోజనమ్ములు, పానపాత్రముల్, చమకాలు
కడుగుచుండుదురంట కవులు హోటళ్ళలో!

అర్థంబు గడియింప నాధునికకవి కాడు!
అందుచే గాబోలు నాంధ్రదేశమ్ములో
ప్రాచీనమార్గంబు బట్టి పోయెడివారి
కర్థంబు, గౌరవం బధికంబుగ లభించు.
'భావకవు' లను వింత పదము కల్పనచేసి
అవహేళనము చేతు రాధునికకవివరుల.

అమెరికాకవివరుల్, ఆంధ్రభావనీకవుల్,
జీవింప దన్నంబుచేతనే మానవుడు.
కష్టాలు హెచ్చుచో కవిత యున్నతి గాంచు:
త్యజియింప రాత్మీయధర్మంబు సోదరుల్!

శివశంకరశాస్త్రి

# యక్ష ప్రవాసి

రామగిరి యాశ్రమపదమ్ముల
విరియబూసిన కడిమిచెట్టుల
వరద గౌతమి వార్షగీతుల
పగిలి పొగిలే యక్షుడా!

ఆశ్రితుని ఆంతర్య మెరుగక
విరహదావపు చురుకు నెరుగక
అర్ధపతి నీ గొంతు గోయగ
సిద్ధపడ్డాడా?

జానకీరాఘవుల, ఉటజ
ప్రాంగణమ్ముల ప్రేమగాథలు
తలపువచ్చి కలత హెచ్చి
తల్లడిల్లే దీనుడా!

చైత్రరథ దివ్యాతిదివ్య
ప్రసవశయ్యాభోగమత్తుడు
విప్రయోగ వ్రణితచిత్తుల
బాధ నెఱుగడయా!—

కనకవలయ భ్రంశరిక్త
ప్రకోష్ఠమ్ముపై తలను వాల్చి
అణువు అణువున ప్రియావిభ్రమ
మరయుచున్నావా?

ప్రేయసీ విరహాగ్నిపర్వత
కీలికీలాకలాపజ్ఞుడు
ఆర్ద్రహృదయుడు మా మహాకవి
అశ్రుమేఘము నంపెనోయ్—

ఎచటి అలకా ధౌతహర్మ్యము!
ఎచటి తూరుపుకొండ లోయలు!
విత్తరాజోన్మత్తరాజస
మెంత చేసెనయా!—

అదిగో! నవ్యాషాఢ మేఘము,
వలపుజాబుల భూర్జపత్రము
మనసుదీరా— వలపులూరా
వ్రాసుకోవయ్యా!

*

యక్ష! నీ కథ యెన్నటిదో? ఆ
చంచలాత్మక మేమి చేసెనో?
కాని: కవిగురు మేఘదూతం
కల్పకల్పము లమృతమోయ్!

హనుమచ్ఛాస్త్రి

# మిత్ర ప్రతిష్ఠ

నీకై ఎదలో నిత్యమందిరము
నిర్మించెద నో సఖుడా!
నీ కందున్నత నిర్మలపీఠము
నిష్ఠించెద నో సఖుడా!

నీ ప్రేమాత్మకనిత్యశరీరము
నిలిపెద నందో సఖుడా!
ప్రమదంబున నా ప్రాణపంచకము
ప్రతిష్ఠచేసెద నందున్!

ఆరక వెలిగెడి ఆశాజ్యోతిని
ఆరాధించెద సఖుడా!
దీపారాధన దిక్కులన్ని దే
దీప్యమానములుగాగన్!

ఆపిన నాగక అతివేలమ్మగ
అధికతరమ్మయి పారలే
అశ్రుధారలను అభిషేకించెద
ఆ నీ మూర్తిని సఖుడా!

భవ్యావాసనాభాసుర నవనవ
దివ్యాకృతులగు కవితా
పుష్పగుచ్ఛముల పూజింతు న్నిను
భూరిప్రేమను సఖుడా!

నా కష్టంబుల నా సౌఖ్యంబుల
నా సుఖంబు లసుఖంబుల్
నానా విధముల నైవేద్యంబుల
నాలుగువేళల చేతునన్!

* * *

అంతలోన నీ యాకారంబది
అరుగుచుండునట వీథిన్,
శబ్దహీనముగ సకలంకమ్మగ
చనుచుండెద వా వేళన్!

" సారహీనమై చను నీ దేహము
సత్యంబగు నీ తనువా?
నే నీ ఎదలో నిల్పిన తేజో
నిర్మలరూపమె నీదా? "

అని తలపోయుచు నశ్రుపరంపర
నభిషేకించెద నిన్నున్;
సౌహార్దంబున నా హృదయములో
సంతోషింతువు సఖుడా!

నోరి నరసింహశాస్త్రి



సఖి! నీ పేలవతీవ్రతిక్తలఘువాక్సంభావనారీతి నే
చిఱివేసి క్షమియింపఁజాలఁ బయిపై చిచ్చెత్తి ప్రత్యంగమున్
అతికోపాయితమామకీననయనవ్యాలీఢరక్తచ్ఛవిన్
జిఱి సంటించి లయించుకొంపు తవరాశీభూతసౌందర్యసం
గతమైత్రీనిలయాయమానమగు మద్గాత్రంబు నిల్వెల్ల నా
చిఱిలో రేగెడి విస్ఫులింగవితతిన్ జిట్లింతు నీ మోమునన్.

కుపితభావత్కశితదృశాంకోణవిశిఖ
శిఖిశిఖండార్చిలోఁ బ్రవేశించి వెడలు
సాహసముఁ బట్టి నా ప్రేమసరణిలోని
సత్వ మెఱుగవో? నా గార్హపత్యఫలమ!

మెలతరో! నీ కనుంగొనలు మెత్తని కత్తులు: కాని నా తమ
స్తిలకితబుద్ధికిన్ జివిమి దీపము వెట్టగవచ్చు నీ తనూ
విలసనమంను, నీ వెడలు వీధులఁ బువ్వులు తేసులెత్తు, నిన్
దలచిన భావముల్ పులకితమ్ములు ప్రత్యహనూతనమ్ములై.

తేపతేప లీలాశుకాలాపఫణితి
పాట పాడుచు మాసికల్ వైచి యింక
కొన్ని కాలాలపాటు తొడ్గుకొనుమోసి!
చీవరంబైన నా ప్రేమ జీవితమును.

**తుమ్మలపల్లి వేంకటరత్నం పంతులు**



# వ్యసనరసికుఁడు

బహ్వంగనాముఖప్రస్యందినవమధు
    గ్రహిళపుష్పంధయాగ్రసరుఁడగుదు
లేలిహ్యమానహాలిప్రియాకారణ
    వ్యాఘూర్ణమాననేత్రాబ్జుఁడగుదు
సంతతాననగుహాసంత్యక్తబహుళధూ
    మాఘకల్పితమృషామేఘుఁడౌదు
చటులతమస్వినీకుటిలనీలాలక
    గ్రథనాపసిద్రితోత్కలిక నౌదు

అగుదుగాకేను; నీవు నన్ననగరాదు
జారుఁడనియు, సురాపుఁడు, చోరుఁడితఁడు
ధూమపాయి యటంచు: నుద్దామదివ్య
వాఙ్మయోత్కృష్టశైబైకవర్ణ్యుఁడగుదు.

నా కరస్పర్శకై లోకమ్ములో నున్న
    ప్రతితీవయుచుఁ బూఁత నట్టుచుండు
నా కంటి రక్తిలో దూఁకెడి హర్షోద
    బిందులకై నోరు విచ్చుఁ బుడమి
నా నిత్యధూమధూపానకే తడిమూరు
    ఖచరికాస్నానార్ద్రకైశికములు
నా నిశానటదంఘ్రినవ లయబ్రహ్మకై
    నీరవప్రకృతి ధ్యానించుచుండు

లోకకళ్యాణఘంటావలీ కలకల
వితత గ్రైవేయయుత గవాంపతిని నన్ను
అనఁగవచ్చునె? కేవలవ్యసని వనుచు
ఆగవచ్చునె? నా యథేచ్ఛానుభవము.

అతిభూమింగతమామకప్రణయ మేహ్యంబైన కానిమ్ము; నీ
యతిమాకందవచోమరందలవసేవానందినౌ నన్ను, నో

తారాపతనం

* ఆంధ్రదేశంలో ఈనెలలో రెండు దివ్యనక్షత్రాలు రాలిపోయినవి. శ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రులవారు జగమెరిగిన మహాపండితులు. సంస్కృత వాఙ్మయాన్ని సర్వాంకషంగా శోధించి వీరు సాధించిన విజ్ఞానం అపారం. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో వీరొసగిన మహోపన్యాసాలు వీరి విజ్ఞానపారాన్ని చూచాయగా తెలుపుతవి. భారతగాథ ఋగ్వేదకాలంనాటికే ప్రవర్తిల్లివున్నట్లు, ఋగ్వేదసూక్తాలలో భారతగాథ అంతా బీజరూపాన ఇమిడి వున్నట్లు నిదర్శనాలతో నిరూపించారు ఆ ఉపన్యాసాల్లో. ఆ విజ్ఞానమంతా ఆంధ్రులకు గ్రంథరూపంలోనైనా లభిస్తే......

సనాతనభారతీయవిజ్ఞానాన్ని నవ్యప్రపంచానికి అనుగుణంగా వ్యాఖ్యానించిన ఈ మహాపండితుడు, యోగి, సంస్కర్త మరణము ఆంధ్రులకు తీరే కొరత కాదు.

* వాసుదాసుడు మహాభక్తుడు, పండితుడు, కవి— మధ్యయుగంలోని పోతన్న అవతరించాడా అనిపించాడు. వాసుదాసుని పోతనగా భావించినప్పుడు మాకు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారియందు శ్రీనాథుడు గోచరిస్తూవుంటాడు. ఆంధ్రమునకు, ఆంధ్రులకు వాసుదాసుని సేవ ఇంతనరానిది. బ్రహ్మాండమైన ఆ రామాయణం, లెక్కలేని ఇతరకృతులు, విశేషించి ఆర్యకథానిధులు ఆంధ్రులకు అమూల్యనిధులు. మానవుని సర్వావస్థల్నీ సొగసుగా దిద్దగల వివిధశ్రేణుల వాఙ్మయాన్నీ వాసుదాసుడు సృష్టించాడు.

ఉత్తర జీవితాన్ని భగవదంకితం చేసి ఆశ్రయించిన శిష్యకోటికి అమృతోపదేశంచేశాడు. ఆంధ్రదేశంలో అనుపదమూ, అనుక్షణమూ రామనామం కనిపించాడు, వినిపించాడు. ధన్యజీవియై తరలిపోయినాడు.

ఈ యిరువురు మహాపురుషుల భవ్యాత్మలకు పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మలోకనివాససిద్ధి కలుగుగాక!



సంపుటి ౧ * శా.శ ౧౮౭౮ ధాత, శ్రావణము * సంచిక 3

# శ్రుతులు

వీణ విషయం

*                ఈ సంచికలో కథలకు ప్రాధాన్యం ఇచ్చాము. ప్రచురించిన మూడు కథలూ వివిధాభిరుచులనూ తృప్తి పరుస్తవని ఆశిస్తున్నాము. శ్రీమాన్ వేంకటాచార్యులవారు శ్రీ కులశేఖరాళ్వారు రచించిన కొన్ని పాశురములను అనువదించి వీణకు ప్రసాదించారు. ఇంకా ప్రసాదిస్తారు. ఇదే విధంగా తమిళ కన్నడ కవులయు, ఔత్తరాహులగు కవులయు రచనలను ఆంధ్రంలోకి తేవడానికి వీణ యత్నిస్తుంది. ఈ పాశురపరిమళములు ఆ దెస తొలి యత్నం. తత్తద్భాషానిష్ణాతుల సహకారాన్ని ఈ విషయంలో వీణ ఎంతో అపేక్షిస్తున్నదని విన్నవిస్తున్నాము.

# విషయసూచిక



---

* హిందీ "మాధురి" నుండి అనువాదం

# వీణ

వ్యవస్థాపకులు, సంపాదకులు:

మాధవశర్మ–రాజగోపాల్

సంపాదకసంఘము

శ్రీరంగం శ్రీనివాసరావు
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
మద్దాలి సూర్యప్రకాశరావు
సోమంచి యజ్ఞన్నశాస్త్రి

సలహా సంఘము

మల్లాది రామకృష్ణశాస్త్రి
బెజవాడ గోపాలరెడ్డి
కె. వి. పున్నయ్య
శ్రీపాద గణపతిరావు

సంపుటం ౧ సంచిక 3

ఆగస్టు, 1936

వీణ కార్యాలయం, తెలప్రోలు, కృష్ణా.

# వీణ

మాస పత్రిక

ధాత, శ్రావణము

సంపాదకుడు

పాటిబండ మాధవశర్మ

యం. ఏ. ( ఆనర్సు )

సంపుటం ౧ సంచిక 3

ఆగస్టు, 1936

సాలు చందా రు 2 లు విడి సంచిక అ 4 లు

వీణ కార్యాలయం, తెలప్రోలు, కృష్ణా.